# ముఖచిత్రం



**గూస్తావ్ క్లిమ్ట్ (1862-1918)**

**చిత్రకారుని గురించి**

గూస్టావ్‌క్లిమ్ట్ (Gustav Klimt)-ఈ శతాబ్ది మలుపులో వెలిసిన ప్రసిద్ధ చిత్రకారులలో ఒకరు 1862లో ఆస్ట్రియా ముఖ్యపట్టణంలో జన్మించాడు, తండ్రి స్వర్ణకారుడు. అనుప్రయుక్త కళల పాఠశాలకు ఇతన్ని పంపారు. అక్కడ బాగా రాణించాడు. అతడు తన 30-40 ఏళ్ళ మధ్య వయస్సులో, గృహాలంకరణ చిత్రాలనెన్నింటినో చేశాడు. ఇళ్ళకప్పులకు పెయింటింగ్స్ వేయడంలో మొనగాడు అతని చిత్రాలన్నీ పైకి అలంకారంగా కనిపించినా, ఉపరితలం భూషణాలంకృతమైనా, వాటిక్రింద నాడీరుగ్మతా సంబంధమైన కామోద్దీపక అంశం కొట్ట వచ్చినట్లుగా కనిపిస్తుంది. ఈ అంశంలో అంతర్లీనంగా దుఃఖకర, అసంతోషకర వాసనలు కనిపిస్తాయి. ఈ అంశాలు అతని సమకాలీనులకు దిగ్భ్రాంతి కలిగించాయి.

**చిత్రం గురించి :**

## మృత్యువు - లైంగికత

జుడిత్ అభివ్యక్తీకరిస్తున్న హర్షోన్మత్తత. కంఠానికి బిగుతుగా ఉన్న కంఠహారం చూడడానికి ఆమె తలను తుంచుతున్నట్లుగా ఉంది కాని ఇది ఆమె లైంగికోల్లాసాన్ని మృత్యు దేవతకు అనుసంధానం చేస్తోంది.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 10 | జూన్ 1998 | సంచిక 6

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక

సాహిత్య ప్రయోజనం - డి. కేశవరావు

మిర్జా గాలిబు - సదాశివ

జిడ్డు కృష్ణమూర్తి దర్శనం - డా. జి. వేదపారాయణ

కోయిల మధుర నాదంలో ... ... ... - కె. శేషగిరిరావు

''కీలుబొమ్మలు'' : ఒక పరిశీలన - ప్రొ. సి. విజయశ్రీ

స్వప్నలిపిని పరిష్కరించగలమా? - శశిశేఖర్

వాసన తో గర్భనిరోధం? - మిసిమి వర్క్‌షాప్

ప్రస్తుత కథా రచనలో మాండలిక భాష అవసరమా ...! - అద్దంకి శ్రీనివాస్

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **మృత్యువు - లైంగికత**

**Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# A BIT BEHIND THE TIMES
## BY RAJ CHATTERJEE

"Sorry, can't make it this time", said our American friend on the phone, "but will you give us a rain-check?"

"Sure, sure", I said, trying to speak American but without the faintest idea of what a "rain-check' meant. I had heard of blank cheques and of cheques that are liable to bounce. I had also seen some hat-check girls in the days of my youth who had made me want to know them better, but a rain-check?

A few days later, I met our friend at the American library. He slapped me on the back (an old American custom, signifying affection) and said, "Say the word fella. Any night this week will do us fine. You gave us a rain-check, remember?"

"Delighted", I said, the penny dropping at last. "Come along on Wednesday night, if that's O.K. with you and your wife?"

And there was that time in England before World War II. A fellow-student had invited me to spend a weekend with him in his home in Devon. "That's England", he enthused. "You don't know what beauty is until you've seen the Devon country-side".

I'd heard of Devonshire cream, the thick, clotted cream that comes in jars and goes well with strawberries. So I went.

That particular neighbour-hood on the moors seemed to have a surfeit of retired "koi-hais" from India and about half a dozen were rounded up to meet me at an evening party.

There was a stately dowager, rather like a ship in full sail, who looked at me through her lorgnette and asked: "Well, young man, I trust you've not been wasting your free time in London and have seen some of our national heritage, h'm? Have you, by chance, seen the Wallace collection?"

"I'm afraid not" I replied, but I've read all his thrillers".

There was pindrop silence in the room following my remark though I didn't know why till later. My friend started talking ludly of the civil war in Spain and how Franco seemed to be getting the better of it.

After the family had retired for the night my friend came into my bedroom, laughing his sides out. "What's so funny?" I asked.

"The old battleship, ha ha, meant the Sir Richard Wallace art collection at the National Gallery, ha, ha, not Edgar Wallace's whodunnits, you chump, ha, ha, ha!"

And many years later, when I should have know better, there was that luncheon in the salad room of the Royal Common-wealth Society's elegant premises in the Horse Guard's Parade. Gleaming hand-cut crystal winked at me from the table. Heavily silver-plated cutlery flanked my plate. How was I to know that the tender asparagus shoots that I picked up from the buffet were not eaten with fork and knive but with one's fingers, as in good old Bharat?

You live, but you don't have to go abroad to learn. So, when your grandson, or grand-daughter calls you a "square" don't be alarmed at the description, "equilateral, rectangle; object, approximately of this shape" given in the O. R. D. Look further down till you come to, "old-fashioned person'. It simply means that you are a nice, homely sort of chap, though a bit behind the times!

# సాహిత్య ప్రయోజనం

## 1970 నోబెల్ పురస్కార స్వీకారోపన్యాసం

**మూలం : అలెగ్జాండర్ సోల్జెనిట్సిన్** **అనువాదం : డి. కేశవరావు**

సముద్రం ఒడ్డుకి తోసేస్తే, ఇసుకలో కూరుకుపోయిన వింతగా తోచే వస్తువుని గానీ, ఆకాశం నుంచి కిందికి పడి అందంగా మెరిసే అర్థంకాని వస్తువుని గానీ దొరకబుచ్చుకున్న ఆదిమ మానవుడు - దాన్ని అటూ యిటూ తిప్పుతూ ఎలా వుపయోగించాలో తెలియక తికమక పడినట్టు ..

మనంకూడా కళని చేతిలో పట్టుకొని కంగారు పడిపోతుంటాం. దానికి మనం స్వంత దారుల మైనట్టు దానికొక లక్ష్యాన్ని ఏర్పరుస్తాం, మాని ఫెస్టోలు రాస్తాం, అమ్ముకుంటాం, అధికారానికి దాన్ని వశం చేస్తాం. వినోదం కోసం పూర్తిగా దాని దిశనే మార్చేస్తాం. అప్పుడప్పుడూ దాన్ని తాత్కాలిక రాజకీయ, సాంఘిక ప్రయోజనాలకు వాడుతుంటాం. ఎలావాడినప్పటికీ కళ అపవిత్రంకాదు. ఎలావుపయోగించినప్పటికీ ప్రతిసారీ అది దాని విచిత్రమైన కాంతిని ప్రసరిస్తూనే వుంటుంది. ఆకాంతి ఏమిటో మనకి పూర్తిగా అర్థం అవుతుందా? కళను నిర్వచించగలమని ఎవరైనా ధైర్యంగా చెప్పగలరా? దాని అన్ని కోణాలను పరిశీలించామని ఎవరనగలరు? ప్రాచీన కాలంలో ఎవరైనా అర్థం చేసుకొని, ఆ వివరాలు మనకి తెలిపి వుండవచ్చు. అయితే కొత్తదనం కోసం తాపత్రయ పడేమనం ఆవివరాలనెక్కడో పోగొట్టు కున్నాం. ఆ సత్యాలని ఇప్పుడెవరైనా మనకి గుర్తుచేసినా, అవి ఒకప్పుడు మనకి చెందినవే నన్న స్పృహ కూడా యిప్పుడు మనకి కలగదు.

ఒక తరగతికి చెందిన కళాకారుడు స్వతంత్రమైన ఒక ఆధ్యాత్మిక ప్రపంచానికి తానే సృష్టికర్తనని తలపోస్తాడు. ఆ ప్రంపచాన్నీ, దానిలోని మనుషులనూ నిర్మించడానికి పూనుకుంటాడు. -కానీ అతడాపనిలో పరాజయం పొందుతాడు. ఒకప్పుడు మనిషి తన అస్తిత్వానికి కేంద్రంతానే అని తలపోసి, అందుకు తగిన ఆధ్యాత్మిక వ్యవస్థను నిర్మించుకోవడంలో విఫలమయ్యాడు - అలాగన్న మాట. ఇంతభారాన్ని ఏ మేధావి మోయలేడు. ఒక వేళ పరాజయం ఎందురైతే దానికి కారణం గతం నుంచీ వస్తున్న వైషమ్యాలూ, చెదిరి ముక్కలైన ఆధునిక మానవుని ఆత్మ, సరైన అవగాహన లేని ప్రజా సమూహమూ కారణాలని వాటిని నిందిస్తాడు.

మరొకకళాకారుడు తనకంటెగొప్పదైన శక్తిని గుర్తించిన ఆనందంతో తనకృషిని కొనసాగిస్తాడు. అప్పుడు తను చేసే రచనల పట్లా, తన పాఠకుల పట్లా చాలా బాధ్యతా యుతంగా ప్రవర్తించవలసి వస్తుంది. ప్రపంచాన్ని నిర్మించిన వాడూ, దాని గతిని నిర్దేశించే వాడూ తనుకాదు. అయినా యీ ప్రపంచం ఏపునాదిపై నిర్మించబడిందో అతనికితెలుసు. ఇతరులకంటే తీవ్రంగా ఈ ప్రపంచంలోని ఐక్యతని, సామరస్యాన్ని గుర్తించడమే కళాకారుని కర్తవ్యం. మనిషికీ ప్రపంచానికీగల సంబంధంలోని ఆనందాన్ని, దానికి మనిషిచేసిన దుర్న్యాయాన్నీ హృదయ స్పర్శిగా ఇతరులకు తెలపడమే అతడి ధర్మం. అపజయం, పేదరికం, రోగం - వేటిలోనైనా సరే, యీ శాశ్వతమైన సంబంధాన్ని గూర్చిన జ్ఞానం అతణ్ణి వీడదు.

కళలోని అసంబద్ధతా, అది అకస్మాత్తుగా చెందే మార్పులూ, అనూహ్యంగా అది కనుగొన్న విషయాలూ, ప్రజలపై అది వేసే ప్రగాఢమైన ముద్రా - ఇవేవీ కళాకారుని ప్రపంచదృష్టికి అందవు అతని ఉద్దేశాలకూ కృషికీ కూడా అందవు.

---

★ **డి. కేశవరావు** రిటైర్డ్ ఆంగ్ల ఉపన్యాసకులు. ఇటీవల మాక్‌మిలన్ కంపెనీకి జి.వి.కె. రాసిన ''కీలుబొమ్మలు''ను ఆంగ్లంలోకి అనువదించారు.

కళలేని మానవసమాజాన్ని ఇంతవరకూ పురావస్తు తత్వజ్ఞులు కనుగొనలేదు నాగరికత ప్రభవించడానికి ముందే అదృశ్యహస్తాలేవో దీన్ని మనకు బహుమతిగా ఇచ్చాయి ఎందుకీ బహుమతి? దీంతో ఏంచేసుకోవాలి? అనివెంటనే అడగలేకపోయాం

కళశిథిలమౌతూవుందనీ, అదినిర్మించిన రూపాలని అధిగమిస్తూ వుందనీ, అది మరణావస్థలో వుందనీ చెప్పే వాళ్లందరి మాటలూ తప్పే మనం మృతువు పాలబడతాం, కాని కళనిలచే వుంటుంది. మరణించేలోగా మనం కళ యొక్క అన్ని పార్శ్వాలనూ అర్థం చేసుకోగలమా? దాని లక్ష్యాలను తెలుసుకోగలమా? అన్నిటికీ పేర్లుండవు. కొన్ని మనల్ని మాటలకందని తీరాలకు కొనిపోతాయి. కరడు గట్టిన, క్రుంగి పోయిన హృదయాలనైనా కరిగించగల శక్తి కళకుంది. కళసాయంతోనే మనం ఒకోసారి మసకగానైనా, సూక్ష్మంగానైనా తర్కానికందని సత్యాలని సాక్షాత్కరింప జేసుకోగలం.

కట్టుకథల్లోచెప్పినటువంటి అద్దంలాంటిది యిది దానిలోకిచూసినప్పుడు మన ప్రతిబింబం కనబడదు. దృష్టిగోచరం కాని, అగమ్యమైన ప్రపంచమేదో కనబడుతుంది దానికోసం మన ఆత్మఅంతా వేదనతో నిండి పోతుంది.

'అందం ప్రపంచాన్ని రక్షిస్తుంది' అని డాస్టవస్కీ ఒకసారి విచిత్రమైన ఉద్ఘాటన చేశాడు. ఇది సాధ్యమా? రక్తసిక్తమైన మన చరిత్రలో అందం ఎవరినైనా రక్షించిందా? ఉదారత్వం, ఔన్నత్యం కలిగించి వుండొచ్చుకొన్ని సందర్భాల్లో, కానీ అందం ఎవర్ని రక్షించింది?

కళకి ఒకప్రత్యేక గుణమయిన అందంలోనే ఏదోవిలక్షణతవుంది. నిజమైన కళ కలిగించే ఉత్తేజం సమగ్రమయినది. తిరస్కార భావం గల హృదయాలనైనా వశం చేసుకోగలిగేది. రాజకీయ ఉపన్యాసమైనా, పత్రికా విమర్శ అయినా, సాంఘిక కార్యక్రమనైనా, తాత్విక చింతన నైనా అసత్యం ఆధారంగా నిర్మించవచ్చు, ఆ అసత్యాన్ని వెంటనే కనుక్కోవడం కష్టమూ కావచ్చు. అయితే దీనికి వ్యతిరేకంగా ఒక ఉపన్యాసమూ, విమర్శా, కార్యక్రమమూ, మరో ప్రత్యామ్నాయ వ్యవస్థా మరొకరు అంతే తార్కికంగాను నిర్మించవచ్చు. అందుకే యిలాంటివి మనకి నమ్మకమూ అపనమ్మకమూ కలిగిస్తాయి. హృదయం నమ్మనిదాన్ని పునరుద్ఘాటించడంలో అర్థం లేదు.

కళలో సత్యాన్ని రూఢి పరిచే విధానం దాంట్లోనే నిక్షిప్తమై వుంటుంది. కృతకమైన భావాలు రూపాలుగా ఆకృతి చెందలేవు, శకలాలుగా విడిపోతాయి. వాటి నెవ్వరూ నమ్మరు. సత్యం ఆధారంగా నిర్మితమైన కళలు బలవంతంగా మనల్ని ఆకట్టుకుంటాయి. యుగాలు గడిచినా ఎవరూ వాటిని ఖండించలేరు.

బహుశా సత్యం, శివం, సుందరం అనే మూడు భావాలు మనం యవ్వనంలో, భౌతికవాదగర్వంలో - అరిగి పోయిన భావాలు అని తిరస్కరించిన సూత్రం కాదేమో! సత్యమూ, శివమూ అనే మొక్కల మొగ్గలను తుంచివేస్తే, సుందరం అనే మొక్క కొమ్మల్ని వేసి మిగతావాటి స్థానంలో నిలిచి, మూడింటికీ సంకేతంగా నిలుస్తుందేమో!

అయితే డాస్టవస్కీ చెప్పిన మాట పొరపాటున అన్నదికాదు. అది భవిష్యవాణి అతడు దివ్యకాంతితో నిండిన ద్రష్ట. అలాంటప్పుడు కళాసాహిత్యాలు ఆధునిక ప్రపంచానికి ఉపయోగపడవా? గత కొద్ది సంవత్సరాలుగా నేను తెలుసుకున్న కాసిన్ని విషయాలను నేడు వివరిస్తాను.

నోబెల్ బహుమతి స్వీకారోపన్యాసం చేసే యీ కుర్చీని చేరడానికి నేను నాల్గైదు మెట్లు మాత్రమే ఎక్కిరాలేదు. వందలు, వేలు, నిటారుగా వుండి మంచుతో కప్పబడివున్న జారుడు

మెట్లను చలిలో, చీకటిలో ఎలాగో దాటి ప్రాణాలతో యిక్కడికి చేరుకున్నాను నా కంటె దృఢమైన వాళ్లూ, ప్రతిభావంతులూ రాలేక పోయారు కొందరు నాకు తెలుసు. సాహితీ పరులుగా పేరున్న వారు కొందరు అదృశ్యమై పోయారు. ఎందరో అనామకులూ కనబడకుండా పోయారు. వాళ్లెవ్వరూ తిరిగి రాలేదు ఒకజాతి సాహిత్యాన్ని నగ్నంగా శవపేటిక కూడా లేకుండా, కాలి వేలికి ఒక నంబరు వేసిన చీటీని మాత్రం తగిలించి ఖననం చేశారు రష్యన్ సాహిత్యం ఎన్నడూ అంతరించలేదు. కాని బయటి నుంచి చూసిన వారికి ఇదొక మరుభూమి లాగా కనిపించేది ఒద్దికగా పెరిగిన చెట్లతో అరణ్యం వుండవలసిన చోట, చెట్లను నరికి వేయగా ఒకటి రెండు చెట్లు మాత్రం మిగిలాయి

ఈ రోజు-హతులైన వీరి నీడలో నిలిచి, నాకంటె ప్రతిభావంతులైన ముందుతరాల వారికి తలవంచి - వారందరూ ఏం చెప్పివుండేవారో ఎలా వూహించగలను? కానీ చెప్పవలసిన బాధ్యత మన మీద వుంది వ్లాడిమిర్ సొలొవ్యేవ్ అన్నట్టు ''సంకెళ్లలో వున్నా, భగవంతుడు నిర్దేశించినమన విధిని మనంతట మనం పూర్తిచేయవలసిందే ''

కాంపులో ఉన్నపుడు ఆందోళన కలిగించే క్షణాల్లో, బారులు తీరివున్న బందీలతో పాటు నిలబడినప్పుడు, గడ్డకట్టుకు పోయే రాత్రిలో సన్నని దీపాల వరసలు మినుకు మినుకు మంటున్నప్పుడు, ప్రపంచానికి వినబడేట్టు ఏదో అరవాలనిపించేది - ప్రపంచం మా అరుపులు వినగలిగితే ప్రపంచం ఎంత తొందరగా ప్రతిస్పందిస్తుందనేదీ మాకు స్పష్టంగా అర్థమయ్యేది మామనసుల్లో భౌతిక ఆధ్యాత్మిక విషయాలు నిండి వుండేవి ఆభావాలు పుస్తకాలు నుంచి వచ్చినవీ కాదు, అరువు తెచ్చుకున్నవీ కావు జైలు గదుల్లోనూ, అడవుల్లో వేసుకున్న చలిమంటల చుట్టూ కూర్చున్నప్పుడూ, ఇప్పుడు లోకంలో లేని కొందరు వ్యక్తులతో మాటాడుతున్నప్పుడూ కలిగిన భావాలవి.

బాహ్యమైన ఒత్తిడులు తగ్గినపుడు, మా అందరి దృక్పథాలు విశాలమైనాయి. చిన్నపగులులోంచి కనబడినా, బాహ్యప్రపంచమంతా దృశ్యమానమయింది మేమనుకున్న రీతిగా అవతలి ప్రపంచం లేకపోవడం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. కొందరు బాధతో కన్నీరు రాలుస్తుంటే, మరికొందరు హాయిగా నృత్యం చేస్తూండడం యీ ప్రపంచం యొక్క ప్రత్యేకత.

ఇదెలా జరిగింది? ఈ అగాధమెలా ఏర్పడింది? సానుభూతి కొరవడింది మాకా, బాహ్య ప్రపంచానికా? భాషా భేదాల వల్లనా? ఒకరు స్పష్టంగా చెప్పిన మాటలను ఇంకొకరెందుకు అర్థం చేసుకోలేకపోతున్నారు మాటలు అదృశ్యమౌతాయి, నీటిలా ప్రవహించిపోతాయి - రంగూ, రుచీ, వాసనా మిగల్చకుండా. నాకు తెలిసినంతవరకకూ ఇప్పటినా భాషా నిర్మాణమూ, అర్థమూ, స్వరమూ కాలగతిలో మారిపోయాయి., దానికి మొట్టమొదట గడ్డకట్టించే రాత్రులలో జైలు కాంపులో నేనురాయతలపెట్టిన భాషకూ పోలికే లేదు.

మనిషికి ప్రపంచంపట్ల గల దృక్పథమూ, అతని ప్రేరణా, జీవిత విలువలూ, చేతలూ, కోరికలూ వ్యక్తిగతమైన లేక సమిష్టి అనుభవాల వల్ల ఏర్పడతాయి. యుగయుగాలనుంచీ ఇలాగే జరుగుతోంది. ప్రసార సాధనాలు అభివృద్ధికాకముందు. ప్రపంచం దగ్గరై ఒక్కటి కాకముందు మనుషులు వ్యక్తిగత, సామూహిక, సాంఘిక, జాతీయ అనుభవాల ఆధారంగా నడుచుకునేవారు. పరిశీలనవల్ల విలువల విషయంగా సాధారణ ప్రమాణాలని ఆమోదించే వీలుండేది సామాన్యమైనదేదో, అసాధారణమైనదేదో, క్రూరత్వమేదో, దుష్టత్వమేదో, నిజాయితీ ఏదో, మోసమేదో తెలుసుకోవడానికి వీలయ్యేది వివిధ ప్రదేశాల్లో నివసించే ప్రజలు భిన్నమైన జీవన విధానాలు అనుసరిస్తున్నప్పటికీ, వారి సాంఘిక విలువల్లో సారూప్యత లేనప్పటికీ యాత్రికులను

తప్ప మరెవ్వరినీ ఆశ్చర్య పరచే వారుకారు మిగిలిన మానవ సమాజానికి వారి జీవన విలువలు ఏరకంగానూ హాని కలిగించేవిగా వుండేవికావు

గత దశాబ్దాలలో మానవజాతి అనూహ్యంగా దగ్గరయింది. దీనివల్ల కోరికలూ ప్రమాదాలు కూడా ఎక్కువయ్యాయి. ఒక చోట జరిగిన హాని నిముషాల మీద ఇంకొక చోటికి ప్రయాణించగలదు. అయితే మానవజాతి ఒక్కటైనా - ఒక సంఘం కానీ, ఒక దేశంకానీ ఏకమైనట్టు లేదు. అనుభవం వల్ల గానీ, పరిశీలన వల్ల గానీ, భాషవల్లగానీ ఏకం కాలేదు. అంతర్జాతీయ పత్రికలూ, రేడియోల వంటి సాధనాల వల్ల మాత్రమే అన్ని అడ్డంకులనూ అధిగమించి ఒక్కటయింది. సంఘటనల తరంగాలు మనల్ని తాకుతాయి. నీటిలో ఏదో పడిన చప్పుడు ఒక్కక్షణంలో సగం ప్రపంచానికి వినిపిస్తుంది. అయితే ఆ సంఘటలని ఎలా విశ్లేషించాలన్నది ప్రసార మాధ్యమాల ద్వారా తేల్చడం సాధ్యంకాదు వివిధ సంఘాలలో, దేశాలలో వివిధ ప్రమాణాలుండడం దీనికి కారణం. చాలా చోట్ల ప్రజలు వారు పడిన కష్టాలు దృష్ట్యా మాత్రమే విలువలని నిర్ణయిస్తారు.

ఇటువంటి కొలబద్దలు ఎన్నోలేకపోయినా, కొన్నయినావున్నాయి. స్థానిక సంఘటనలకీ, సుదూరప్రాంతాలకీ- ప్రాచీన, నూతన సమాజాలకీ - ధనవంతమైన, అననుకూల పరిస్థితులున్న సమాజాలకీ వేర్వేరు విలువలుంటాయి. అవీ ఒకే రకంగావుండవు. అందుచేత అవిమనల్ని తికమక పెడతాయి. మనకి సంబంధించని విలువలు మనకి భాధాకరంగా వుండడం చేత, వాటిని మనం పక్కకి తోసివేస్తాం మన విలువలనే ప్రమాణంగా ప్రపంచాన్ని కొలుస్తాం దూరాన వినబడే బాధాతప్తజీవుల ఆక్రందనలు మన ముంగిటికి రానంతవరకూ వాటిని సహించగల మనే అనుకుంటాం.

ఒక పక్కవేలాది క్రైస్తవులు - రోమనులు పెట్టిన బాధలకి సమానమైన బాధల్ని అనుభవించి, నిశ్శబ్దంగా భగవంతుని మీద నమ్మకం కోసం ప్రాణాలను వదులుకుంటున్నారు. ప్రపంచానికాప్రక్క (కొద్దిమంది లాంటి) ఒకపిచ్చివాడు మతం నుంచి మనల్ని విడుదల చేస్తావనిగొంతెత్తి అరుస్తున్నాడు. అతని వ్యక్తిగత విలువల ప్రమాణాన్ని ఉపయోగించి అందరి తరుపునా అతడే నిర్ణయించేశాడు.

దూరం నుంచి చూసి ఒకరి కున్న స్వతంత్రానికీ, అదృష్టానికీ అసూయ పడతాం కానీ దగ్గరనించి చూస్తే అదొక బాధాకరమైన భానిసత్వం అనిపిస్తుంది. ఒక దేశంలోని అనుహ్యామైన సంపద, మరొక దృష్టితో అనాగరికమైన దోపిడీ అనిపిస్తుంది. అన్ని చోట్లా యీ విలువల తేడాలుంటాయి. రెండు లక్షలమంది వరదలలో కొట్టుకు పోతే, అది ఒక స్థానిక రోడ్డు ప్రమాదం కంటె చిన్నదిగా తోచవచ్చు. తిరస్కార భావాన్ని సూచించే ఒక చిరునవ్వుగానీ, భంగిమగానీ చాలా అవమానకరమైనదిగా పరిగణించవచ్చు. క్రూరంగా చితక బాదటాన్ని ఒకచెడ్డ జోక్ అనితలంచవచ్చు. శిక్షలకూనేరాలకూ కూడా యిలాగే అభిప్రాయాలు మారు తుంటాయి. ఒకనెల రోజులపాటు అరెస్టు చేసివుంచడమో, దేశ బహిష్కరణ చేయడమో, ఏకాంత కారాగార వాసం విధించడమో తీవ్రంగా పరిగణించబడి, పత్రికల కాలమ్స్ నిండిపోతాయి. పాతిక సంవత్సరాల కారాగార వాస శిక్షనో, మంచు నిండిన గోడలు గల జైళ్లలో అర్ధనగ్నంగా ఏకాంత వాస శిక్షవెయ్యడాన్నో, ఆరోగ్యవంతులను పిచ్చాసుపత్రిలో పడెయ్యాడాన్నో. ఏదో కారణానికి తెలివి తక్కువగా దేశసరిహద్దుల్ని దాటి పారిపోతున్న కాందశీకుల్ని కాల్చిచంపడాన్నో ఒప్పుకోదగిని ప్రవర్తనేనన్న అభిప్రాయం ఒకోసారి వ్యక్త మౌతుంది. ఎవరో కొందరు పత్రికావిలేఖరుల ఊహాగానాలు తప్ప మనకేమీ తెలియని దూరదేశాల గురించి మనం ఆందోళన పడకుండా హాయిగా వుండొచ్చు.

ఈ రకమైన ద్వైధీభావానికి, దూరంగా వున్నవారి బాధల్ని అర్థం చేసుకో లేకపోవడానికి -

ఎవరూకారణంకాదు మనిషి తత్వమే అంత అయితే మానవజాతి కంతకూ పరస్పర అవగాహనలోపిస్తే వినాశనం తప్పదు విలువలు ప్రమాణాలెన్ని వున్నా, ఒకే ప్రపంచం అనేది వుండదు ఒకే మానవ జాతివుండదు వుండడానికి వీలులేదు స్పందనల తేడాతో, లయలోగల భేదాలతో మానవాళి రెండుభాగాలవుతుంది రెండు గుండెలున్న మనిషి జీవించడం అసాధ్యమైనట్టుగా, మానవాళి ఒక్కటిగా భూమిమీద మనుగడసాగించలేదు

ఈ విలువల ప్రమాణాలను ఎవరు, ఎలా ఒకే రకంగా వుండేలా సరిజేస్తారు? మంచీ చెడులు చెయ్యడానికీ భరించగల, దుర్భరమైన వాటిని తెలుసుకోడానికీ అందరికీ అనువర్తించే ఒకే రకమైన విధానాన్ని ఎవరు రూపొందిస్తారు? సామీప్యంవల్ల బాధకరమయినవనీ, దూరాన జరిగే ఘోరాలు దుస్సహమైనవి అనీ ఒకేరీతిలో అంచనావేయగల పద్ధతిని గూర్చి ఎవరు వివరిస్తారు? స్వీయానుభవాలనిదాటి ఇలాటి ప్రమాణాలు నెలకొల్పగల అవగాహన ఎవరికుంటుంది? ఇరుకు మనసులున్న మొండి వాళ్లకి దూరంగా వున్నవారి సుఖదుఃఖాలు తెలుసుకోగలిగేట్టు చెయ్యగల నేర్పరితనం ఎవరికుంది? ప్రచారమూ, బలవంతమూ, శాస్త్రీయమైన రుజువులూ- ఏవీ పనికిరావు. అయితే అదృష్టవశాత్తు ఒకే ఒక మార్గముంది కళలు, సాహిత్యం మాత్రమే యీ పనిచెయ్యగలవు

నిజానికి యివి అద్భుతాలను చెయ్యగలవు. స్వీయాను భవాలని అధిగమించి యితరుల గూర్చి తెలుసుకొనేట్టు చేయగలవు. మనిషికి తను జీవించిన కొద్ది కాలంలోనూ మరో మనిషి జీవితాను భవాలని తెలివిడి చేయగల శక్తి వుంది వీటికి

అంతకంటె ముఖ్యమైంది మరొకటుంది. దేశాలు, ఖండాలూ ఒకటి చేసిన తప్పుల్ని మరొకటి ఆలస్యంగానైనా చేస్తాయి ఒక్కోసారి అన్ని విషయాలూ స్పష్టమయ్యాయని తెలిశాక కూడా శతాబ్దాలు దాటిన తరువాతైనా యీ తప్పులు మళ్లీ చేస్తాయి. అంతేకాదు, ఒకజాతి అనుభవించి, ఆలోచించి తిరస్కరించిన భావం, మరోదేశంలో అత్యాధునిక భావన అవుతుంది. ఇక్కడకూడా మనం అనుభవించి విజ్ఞానాన్ని తెలుసుకునే మార్గం కళలూ, సాహిత్యమే అవుతాయి. భాష, ఆచారాలు, సాంఘిక వ్యవస్థలు పరిధిలు దాటి - ఇవి ఒక దేశం నుండి మరొక దేశానికి ఆచరణ యోగ్యమైన అనుభవాల్నీ, దశాబ్దాలుగా తాము చవి చూసిన చేదు నిజాల్నీ ప్రసారం చేయగలవు. ఇలాంటి పరిజ్ఞానం ఒకోసారి ఒకదేశాన్ని ప్రమాదకరమైన తప్పుడు మార్గం నుంచి లేదా వినాశకరమైన పద్ధతులనుంచి రక్షించగలదు. ఈ రకంగా యివి మానవ చరిత్రని ఎన్నో మెలికలనుంచి తప్పించగలవు ఈ రోజు ఈనోబెల్ బహుమతి వేదికనుంచి కళలు చేయగలగొప్పమేలొనరించే లక్షణాలని గురించి నొక్కి చెప్పదలచుకున్నాను

తిరస్కరించ వీలుకాని అనుభవాలన్ని క్లుప్తంగా ఒక తరంనుంచి మరోతరానికి సాహిత్యం ఇంకో విధంగా కూడా ప్రసారం చేయగలదు. ఈ విధంగా అది ఒకజాతి జ్ఞాపకంగా నిలిచిపోతుంది చరిత్రలో మాసిపోయిన విషయాలని కూడా సాహిత్యం ఏవిక్రుతీ, అసత్యమూలేకుండా పరిరక్షిస్తుంది. ఈ విధంగా సాహిత్యమూ, భాషా కూడా ఒక దేశపు ఆత్మని రక్షిస్తాయి

దేశాల్నీ, వివిధ దేశాల ప్రజల్నీ సమానం చేస్తామనడం యీ మధ్య ఒక ఫ్యాషనైపోయింది, ఇది విషయాంతరమైనా నేనీ అభిప్రాయంతో ఏకీ భవించను దేశాలిలా అదృశ్యం కావడం - ప్రజలంతా ఒకే మొహంతో, ఒకే లక్షణాలతో ఒక్కలాగే కనిపించడం లాంటిది దాని వల్ల మనం, చాలా నష్టపోతాం. ఒక దేశప్రజలు ఆదేశపు సామాన్య వ్యక్తిత్వాన్ని ప్రతిబింబిస్తారు. ఎంత కనీస స్థాయిలో వున్న వాడైనా భగవంతుని ఉద్దేశాన్ని ప్రతిబింబించే ఒక ప్రత్యేక సృష్టి అనొచ్చు

బలప్రయోగంతో, బలవంతంగా సాహిత్యాన్ని (జీవితంనుంచి) విడదీసిన ఏ దేశానికైనా

దుర్దశ తప్పదు. ఇది పత్రికా స్వాతంత్ర్యం హరించడం వంటిది కాదు. దేశం హృదయ స్పందనని ఆపేయటం. జాతి జ్ఞాపకాలను సమూలంగా లాగివేయటం ప్రజలు తమ ఆధ్యాత్మిక ఏకత్వాన్ని మరిచిపోతారు ఒకే భాషమాట్లాడుతున్నా, ఒకరిమాట ఒకరు అర్థం చేసుకోలేరు. మౌనతరాలు ఉద్భవించి సమసిపోతాయి. తమ గురించేమీ చెప్పుకోలేవు యీతరాలు అఖ్మతోవా, జమ్యాటిన్ అనేమహారచయితలు నాలుగుగోడల మధ్యా జీవితకాలమంతా బంధింపబడి, సమాధుల నిశ్శబ్దానికి బహిష్కరింపబడడం వారివ్యక్తిగత దురదృష్టమేమీ కాదు అది ఒక దేశమే దుఃఖించవలసిన విషయం. మానవాళికంతా భయంగొలిపేసన్నివేశం - ఆనిశ్శబ్దాన్ని సరిగా అర్థం చేసుకోలేకపోతే.

కళకీ, కళాకారుడికీ తమ స్వంతజీవితాలుండవచ్చునా, లేక అవి పక్షపాత ధోరణిలేని సంఘసేవకి అంకితమైపోవాలా అనే విషయం మీద చాలా చర్చలు జరిగాయి. నిజానికి నాకిక్కడేం సమస్య కనబడదు. ఈ చర్చలోకి కూడా దిగను. ఈ విషయం మీద అల్బర్ట్‌కామూ చేసిన నోబెల్ ప్రసంగం మహత్తరమైంది. రష్యన్ సాహిత్యం కూడా దశాబ్దాలుగా ఆదిశలోనే పయనించింది అదే సంప్రదాయాన్ని నాకు సాధ్యమైనంతగా నేనూ ఆచరించాను - ఆత్మస్తుతి లేకుండా చెబుతున్నాను. తరతరాలుగా రష్యన్ సాహిత్యంతో ''రచయిత తన ప్రజలకెంతో సేవచేయగలడు, చేయాలి కూడా'' - అనే భావన అంతర్లీనంగా వుంది

మిగతా ప్రపంచంలో జరిగేది వదిలేస్తే, ఒకరచయిత తన స్వీయ అనుభవాలని వ్యక్తీకరించిడానికి గల హక్కునుకాలరాయ నవసరం లేదు. కళాకారుణ్ణి మనమేవిధంగానూ శాసించ నవసరంలేదు కానీ అతణ్ణి మనం నిందించవచ్చు, అభ్యర్థించవచ్చు, బతిమాలవచ్చు. ఎందుకంటే అతడికి పుట్టుకతోనే సంక్రమించిన ప్రతిభను, స్వేచ్ఛ ఆలంబనగా చేసుకొని, కొంతవరకే పెంపొందించుకోగలడు కళాకారుడు ఎవ్వరికీ ఏ విధంగా ఋణగ్రస్తుడు కాదని వొప్పుకున్నా, కేవలం ఆంతర్ముఖుడై నిజమైన ప్రపంచాన్ని సృష్టించి స్వార్థపరులకీ అనామకులకీ మతి స్థిమితం లేని వారికీ ధారదత్తం చేస్తాడు. ఇదే బాధకరమైనది

మిగతా శతాబ్దాలకంటె ఇరవయ్యో శతాబ్దం మరింతక్రూరంగా తయారయింది ఈ ఘోరాలన్నీ యీ శతాబ్దపు పూర్వార్థంతోనే అంతం కాలేదు. ఆది మానవుని భావనలైన దురాశ, అసూయ, హింస, ద్వేషం పేర్లు మార్చుకొని వర్గ సంఘర్షణ, జాతిద్వేషం, ప్రజా ఉద్యమం, కార్మిక వర్గ ఘర్షణ అనే మర్యాదకరమైన నామాలతో ప్రపంచాన్ని చీలుస్తూనే వున్నాయి. ఆదిమ మానవుని రాజీ పడకపోవడం ఒక సిద్ధాంతంగా ప్రతిపాదించబడింది. అదివొక సంప్రదాయిక సద్గుణమైంది. దీనికి లక్షలాది ప్రజలు అంతం లేని అంతర్యుద్ధాలలో బలిపశువులు కావలిసిందే. మంచి, న్యాయం అనే సార్వకాలిక భావాలు లేనట్టుగా అర్థంచేసుకుంటాం. అవి ఎప్పటికప్పుడు మారి పోయే భావాలనీ, పార్టీకి ఏదిలాభదాయకమైతే అది చేయాలనీ అనుకుంటాం. వెలుపలి నుంచిచూస్తేపాశ్చాత్య సమాజంలోని చెత్తంతా స్థిరత్వం కోల్పోయే దశకి చేరుకుందనీ, ఏక్షణాన్నైనా కూలిపోయేలా వుందనీ అనిపిస్తుంది. ప్రాచీన న్యాయ పరిధుల్లో ఇమడని హింస నిస్సిగ్గుగా విజయవంతంగా ప్రపంచంలో షికారుచేస్తోంది. హింస యొక్క నిష్ప్రయోజకత్వం చరిత్రలో ఎన్నోసార్లు రుజువైనా మళ్లీ అదే ధోరణి కనిపిస్తోంది. హింస ఒక్కటే విజయం పొందదు. బాకాలూది దాన్ని సమర్థించుకోవడం అనేది కూడాగెలుస్తుంది. బలంతో ఏమైనా సాధించవచ్చునీ, న్యాయంతో ఏమీ సాధించలేమని ఒకనమ్మకం పాతుకుపోయివుంది. డాస్టవస్కీ చెప్పిన 'దయ్యాలు' మనకళ్ల ముందే వున్నాయి. అవి ప్రపంచమంతా తిరుగుతూ, విమానాలను హైజాక్‌చేస్తూ, మనుషులని బందీలుగా పట్టుకుంటూ, బాంబులను పేలుస్తూ, ఆ అగ్నికీలల్లో నాగరికతా విధ్వంసం చేయాలనే సంకల్పంతో వున్నాయి. అవి గెలిచినా గెలవవచ్చు.

ఈ శతాబ్దంలో నాగరిక ప్రపంచానికి - కోరలు చాచి భయపెట్టే పాశవికతని వ్యతిరేకించడానికి ఏమీ దొరకలేదు - రాజీధోరణులు, చిరునవ్వులూ తప్ప, పిరికి తనానికీ మూల్యం చెల్లించ వలసి వుంటుంది. ధైర్యమూ, విజయమూ మనం చేసే త్యాగాలు పైనే ఆధారపడివుంటాయి భౌతికంగా అణచివేయబడ్డ ప్రపంచం, ఆధ్యాత్మికంగా కూడా ఐక్యత సాధించలేదనే బయం కూడా మనకుంది. విజ్ఞానమూ, కరుణా ప్రపంచంలోని ఒక భాగం నుండి మరో భాగానికి ప్రయాణించడానికి అనుమతిలేదు. విజ్ఞానం ప్రపంచమంతా వ్యాప్తిచెందడానికి అడ్డంకులుండడం ఘోరమైన ప్రమాదం ఇలా జరిగితే అంతర్జాతీయ ఒడంబడికలు అబద్ధాలౌతాయి వాటికి ఇష్టమొచ్చిన అర్థాలివ్వడం కూడా సాధ్యమౌతుంది.

పాతికేళ్ల క్రిందట మానవాళికి ఆశాజ్యోతిలా ఐక్యరాజ్యసమితి ఉద్భవించింది, అయితే అనైతికమైన యీ ప్రపంచంలో అదీ అనైతికంగా తయారయింది ఇది ఐక్యరాజ్యసమితి కాదు, ప్రభుత్వాల సమితి ఎన్నుకోబడిన ప్రభుత్వాలు గలవాళ్లూ, బలం సాయంతో ప్రభుత్వం చేపట్టిన వాళ్లూ, సాయుధబలగాలతో ప్రభుత్వాన్ని చేజిక్కించుకున్న వాళ్లూ - అందరూ అక్కడ సమానమే. ఎక్కువ మంది సభ్యుల లాభాలకోసం ఐక్యరాజ్యసమితి కొందరిస్వేచ్ఛగురించి మాత్రమే పట్టించుకుంటుంది ఒక వోటు ద్వారా అది సామాన్య ప్రజల ఫిర్యాదులను తిరస్కరించింది మానవ హక్కుల పరిరక్షణ దీనిలో సభ్యత్వానికి ముఖ్య నిబంధన అని అది ఎన్నడూ విధించలేదు ఇది సామాన్య ప్రజలను వంచించడమే

ఆధునిక సమాజం అంతా శాస్త్రజ్ఞుల చేతిలో వుందనీ, సాంకేతిక ప్రగతిని వాళ్లు నిర్దేశిస్తారనీ, దానిలో రాజకీయ నాయకుల ప్రమేయమేమీ వుండదనీ అనుకుంటాం. కానీ శాస్త్రజ్ఞులు మానవవాళిలో క్రియాశీలక శక్తిగా రూపొందడానికే యత్నమూ చేయలేదు ఇతరుల బాధల గురించి వారి సమావేశాల్లో పట్టించుకోరు, శాస్త్ర పరిధిలో వుంటేనే వాళ్లకి సౌకర్యంగా వుంటుంది.

వినాశం అంచునవున్న, క్రూరమైన యీ ప్రపంచంలో రచయిత స్థానం ఏమిటి? వాళ్లు రాకెట్లను పంపలేరు. చిన్నతోపుడు బండినికూడా ఉపయోగించరు. భౌతికమైన శక్తిని మాత్రమే గౌరవించేవాళ్లు, వీళ్లని ద్వేషిస్తారు.

అలాంటప్పుడు తిరోగమన భావమూ, మంచిపట్లా సత్యం పట్లా నమ్మకాన్ని సడలించుకోవడమూ, బాధలనే గాథలుగా చెప్పడమూ, ప్రపంచమెంత దిగజారిపోయిందో ననీ మానవులెంత నీచులయ్యారో ననీ వాపోవడమూ - ఇవన్నీ వీళ్లకి సహజమేకదా? ఏకాంతంలో వున్న చైతన్య వంతమైన అందమైన ఆత్మలు జీవించడం ఎంత కష్టమోననీ వీరు సహజంగానే బాధపడవచ్చు అయితే యిది కూడా దారికాదు, 'వాక్కు'కు కట్టుబడిన తర్వాత గత్యంతరం లేదు. రచయిత తనదేశస్థుల మీదా, సమకాలికుల మీదా తీర్పు నిచ్చే న్యాయాధికారి కాదు తన దేశమూ, తన ప్రజలూ కలిగించే హానికి తనుకూడా బాధ్యుడే. తనదేశపుటాంకులు ఇంకోక దేశపు ముఖ్య పట్టణంలో రక్తం చిందిస్తే, ఆరక్తపు మరకలు శాశ్వతంగా అతడి ముఖంపై ముద్రపడి వుంటాయి. ఏదో ఒక రాత్రిలో నిద్రిస్తున్న అతడి స్నేహితుడి గొంతునులమబడితే, ఆతాడు చేసిన గాయాలు రచయిత చేతి మీద ముద్రించబడతాయి. యువకులు శ్రమకంటే వ్యభిచారమే మేలని నిర్ణయిస్తే, హానికరమైన మత్తుమందు ప్రభావంలో పడిపోతే, డబ్బుకోసం ఖైదీలుగా ప్రజలను నిర్బంధిస్తే - ఆ దుర్వాసన రచయిత ఊపిరిలో కలిసిపోతుంది

ప్రపంచానికయిన గాయాల బాధ్యత మనదికాదని చెప్పేధైర్యం మనకుందా? ప్రపంచసాహిత్యమనేదొకటి ప్రభవించి, ప్రపంచంలోని కష్టనిష్ఠూరాలకు ఒక గుండెలా ప్రతిస్పందిస్తుందని, నా ఆశ మన అవగాహనలు వేరైనా, ఒకటే సాహిత్యముండాలని నా ఆకాంక్ష

గతంలో కూడా ప్రాచీన జాతీయ సాహిత్యాలకు తోడుగా పరస్పర ప్రభావాలతో ప్రపంచసాహిత్యం వుండాలనే భావన వుండేది కొంత అంతరం రావడం వల్ల పరస్పర ప్రభావం పడడం ఆలస్యమయింది. కొన్ని శతాబ్దాలుకూడా అయింది. జాతీయ సాహిత్యాల శిఖరాలు సమకాలీనులు కాక, తర్వాతి తరాల వారు చూడడం జరిగింది.

ఈ రోజు ఒక దేశపు రచయితకూ, మరోదేశపు పాఠక రచయితకూ క్షణంలో పరస్పర సంబంధం ఏర్పడగలదు. ఈ విషయం నాకు స్వానుభవం వల్ల తెలుసును. నాదేశంలో ప్రచురణ కాని నాపుస్తకాలకు ప్రపంచ పాఠకులు దొరికారు, రచయితల సమాఖ్యనుండి నన్ను తొలగించిన ప్రమాదకరమైన రోజుల్లో, ప్రముఖ ప్రపంచ రచయితలు నా చుట్టూ ఒక రక్షణ కుడ్యాన్ని నిర్మించి, నన్ను ఘోరమైన హింస నుండికాపాడారు. నన్నుదేశబహిష్కారం చేసేటట్టయితే, వుండడానికని నార్వేరచయితలందరూ నాకోసం వసతిని సిద్ధం చేసివుంచారు. నన్ను నోబెల్ బహుమతికి సిఫార్సుచేసింది కూడా నా దేశం వారుకాదు. Francois Mavriac అతడి సహచరుల వల్ల జరిగింది. తర్వాత జాతీయరచయితల సమాఖ్యలు నాకు ప్రోత్సాహాన్నిచ్చాయి.

నాకు తెలిసినంతవరకూ ప్రపంచ సాహిత్యమనేది విమర్శకులు సృష్టించిన భావం మాత్రం కాదని నా ఉద్దేశం. మానవుని ఆలోచనావిధానాలను తెలిపే ఒక మాఙ్మయ సముదాయం అది. కొన్ని దేశాల ప్రభుత్వాల ఆంతరంగిక శాఖలు మాత్రం యింకా సాహిత్యం వాళ్ల వ్యవహారమే అని తలపోస్తున్నాయి. మానవులతో క్రిక్కిరిసిన యీ భూమిపైన ఆంతరంగిక వ్యవహారమనేది మిగల్లేదు. అందరూ అన్ని విషయాల గురించీ స్పందిస్తేనే మానవాళికి విముక్తివుంది మానవ జీవితంలో అతిసున్నితంగా ప్రతిస్పందించేపరికరమైన యీ సాహిత్యం మొట్టమొదటగా మానవాళి ఏకత్వాన్ని గుర్తించింది. కాబట్టి యీ ప్రపంచ సాహిత్యంగురించి నేనెంతో నమ్మకంతో వున్నాను

యీ భయంకరమైన కాలంలో స్పష్టంగా చూడడానికి యీసాహిత్యం దోహదం చేస్తుందని నమ్ముతాను. భిన్నమైన విలువల ప్రమాణాలను స్థిరీకరించి, దేశాల చరిత్రలపై పరస్పరావగాహన పెంచుతుంది. ఇందువల్ల చేసిన తప్పులు మళ్ళీ చెయ్యకుండా వుండడం వీలవుతుంది. విశాలమైన ప్రాపంచిక దృక్పథం ఏర్పడుతుంది. భిన్నమైన విలువల ఆధారంగా ప్రపంచ ప్రమాణాలను నెలకొల్పవచ్చు.

విజయవంతంకాని ప్రభుత్వాలకూ, సంఘాలకూ, వాటి పిరికితనానికీ అవమానాలకూ, ఆత్మ సంతృప్తిలాంటి బలహీనతలకూ, యువకుల బాధ్యతారాహిత్యానికీ, వారి హింసాప్రవృత్తికీ నిరసన తెలిపేవారు రచయితలు కాక మరెవరు? నిర్దాక్షిణ్యమైన హింసకు ప్రతిగా సాహిత్యం ఏంచేయగలదు? అని అడుగుతారు కొందరు. హింస దానంతట అదే వృద్ధి పొందలేదని మనం మరువరాదు. అసత్యానికీ దానికీ విడదీయరాని అనుబంధం. అసత్యం బ్రతికేదీ హింసవల్లనే. మొదట్లో హింస నేరుగా, గర్వంగా ప్రవర్తిస్తుంది. దానికి బలం చేకూరి ఒక స్థాయికి వచ్చాక, అసత్యమనే పొగమంచును కప్పేసుకొని, అసత్యం వాడే తీయనైన వాక్చాతుర్యాన్ని ప్రదర్శిస్తుంది.

ధైర్యవంతుడైన సామాన్యమానవుడు చేయగలిగిన పని అసత్యానికి చేయూతనివ్వకపోవడం అది ప్రపంచమంతా వ్యాపించనీ, పరిపాలించనీ - కానీ నా సహాయం వల్ల కాదు అనుకోవడం. రచయితలూ, కళాకారులూ ఇంకా గొప్పపని చెయ్యగలరు. అసత్యాలని ఓడించగలరు. అసత్యంతో తలపడినప్పుడు కళ ఎప్పుడూ విజయం సాధిస్తుంది. అసత్యం కళని మాత్రం ఎదిరించలేదు. అసత్యం ఓడితే, జుగుప్సాకరమైన హింసా స్వరూపం బయటపడుతుంది. అది డొల్లగా వుండడం వల్ల కూలిపోతుంది.

ఈ రకంగా మనం ప్రపంచానికి సాయం చేయగలం.

# మిర్జా గాలిబు

– సదాశివ

ప్రొ. రషీదహమద్ సిద్దీఖీ వచన శైలి విలక్షణమైంది విశిష్టమైంది. అతని ప్రతి వాక్యం గజల్‌షేర్ వలె సుందరం ప్రామాణికం కూడా ఒక వాక్యం అతడిలా రాసినాడు;

''మొగలులు మన దేశానికే మిచ్చినారని ఎవరైనా ప్రశ్నిస్తే మూడు బహుమూల్యమైన బహుమతులిచ్చి వెళ్లినారని నేనంటాను తాజ్‌మహల్, ఉర్దూ, మిర్జాగాలిబు''.

తాజ్‌మహల్ గురించి ఎవరికి తెలియదని? ఉర్దూ ఎంత అందమైన భాషో, ఆ భాషలోని సాహిత్యం, ముఖ్యంగా గజల్ కవిత, ఎంతరమణీయంగా వుంటుందో అందరికీ తెలిసిన విషయమే. ఉర్దూ ప్రసక్తిరాగానే వెంటనే స్ఫురించేది గజల్. గజల్ పేరెత్తగానే జ్ఞప్తికి తగిలే కవి మిర్జాగాలిబు. ఉర్దూతో ఒకింత పరిచయమున్న వాళ్లకయినా, గాలిబ్ షేర్లు కొన్ని నాలుక చివర వుంటాయి. కానయితే గాలిబ్ గజల్లు చప్పున అర్థమయ్యేమి కావు.

గజల్ ఆపాత మధురమైన కవిత. దానికి టీకా తాత్పర్యాల అవసరం లేదు. ఉర్దూ గజల్ల సంకలనాలు వ్యాఖ్యాన సాపేక్షకాలు కావు. కానీ గాలిబ్ గజల్లకు ఐదారు వ్యాఖ్యానాలు వెలసినవి వ్యాఖ్యాతలు పీను మిగిలిన విద్వాంసులు కవులు. ఇప్పుడు మనకు లభిస్తున్న 'దీవానె - గాలిబ్' చాలా చిన్నది. దీనికే ఇన్ని వ్యాఖ్యానాలు గాలిబ్ కాలంలో అతని మిత్రులు కొందరు అతని అనుమతితోనే కఠిన శబ్దాలు, అన్వయక్లిష్టత గల షేర్లను చాలవరకు తొలగించినారు. అవన్నీ వుంటే ఇంకెన్ని వ్యాఖ్యానాలు కావలసి వచ్చేవో!

గాలిబ్ సమకాలికులైన జోఖ్, మోమిన్, షేఫ్తా, ఆజుర్దా మొ॥ కవులు పూర్వ మహాకవులైన మీర్, సౌదా, ఆతిష్‌ల వలె సరళ సుందర శబ్దాలతో చప్పున అర్థమయ్యే భావాలు గల గజల్లు చెప్పేవాళ్లు. ఆ గజల్లు అప్పటి సాహిత్య రసికులకు ఆనందం కలిగించేవి. గాలిబు మహా మేధావి. అతని కల్పనా శక్తి అసాధారణమైంది. భావాలు గంభీరమైనవి. ఊహలు ఉన్నతమైనవి. అవి ఆనాటి సాహిత్య వేత్తలకు ఆనందం కలిగించేవి కావు. ''మీర్ కవితను అర్థం చేసుకోగలం, సౌదా సాహిత్య భాషను గ్రహించ గలం. కానీ మీ కవిత, మీ భాష మాకర్థమయ్యేవి కావు. అవి మీకే అర్థం కావాలె. లేదా పై వానికే అర్థం కావాలె.'' అని పరిహసించే వారు. ఈ కవులందరికీ ఆశ్రయదాత, చివరి మొగల్ చక్రవర్తి, బహద్దూర్‌షా జఫర్, అతడూ మంచికవే. కానీ అతనికీ అర్థమయ్యేవి కావు. కానయితే మిర్జాగాలిబు కొన్నాళ్లు బహద్దూర్ షాజఫర్ గజల్లు దిద్దినాడు.

ఏ ముషాయిరాలోనూ తన కవితకు ఒక్క వాహ్వాకూడా లభించనందుకు అతడు ఖిన్నుడయ్యేవాడు.

నషితాయిష్‌కి తమాన్నా నసిలేకీ పర్వా

గర్ నహీహై మెరే ఆష్- ఆర్ మే మానే నసహీ

''నాకు ప్రశంసల పట్టింపు లేదు ప్రతి ఫలాపేక్షలేదు నా కవిత అర్థరహితమయితే కానీయండి.'' అని ఊర్కుండేవాడు.

మిర్జా గాలిబు కవిత అంతకఠిన పాకాన పడటానికి కారణమేమిటి?

అతడు మహామేధావి. భావ తీవ్రత గలవాడు. పైగా ఫారసీ భాషపట్ల అతనికి వల్లమాలిన అభిమానం. సజాతీయమైన ఫారసీభాష తనకొక్కనికే వచ్చుననే దర్పం కలవాడు ఆ దర్పానికి కారణం భారతీయ కవులు ఫారసీ భాషను భారతీయులైన ఫారసీ విద్వాంసుల నుంచి నేర్చినారు అతడు హర్‌ముజ్ అనే ఫారసీ గురువుతో ఫారసీ నేర్చినాడు హర్‌ముజ్ ఇస్లాంమతం స్వీకరించి అబ్దుల్‌సమద్ అని పేరు మార్చుకున్నాడు. మిర్జాగాలిబ్ తుర్కిస్థానము లోని సల్జూఖీ రాజవంశానికి చెందినవాడు అతని తండ్రి తాతలు యోద్ధలు. వాళ్లకు స్వదేశి సంస్థానాధిపతులు ఒక జాగీరిచ్చినారు ఆ జాగీరును కంపెనీ ప్రభుత్వం లాక్కొని దాని వంతుకు కొంత భరణము ఏర్పాటు చేసింది అదీ అతనికి సరిగా దొరికేది కాదు. దానికోసం జీవితాంతం పోరాడినాడు. అతడు జాగీరు లేని జాగీర్దారు. డబ్బు లేని నవాబు. అతని పూర్తి పేరు నవాబ్ మిర్జా అసదుల్లా బేగ్ ఖాన్ గాలిబ్ వ్యవహార నామం మిర్జా నౌషా. బహద్దూర్ షా జఫర్ అతనికి నజముద్దౌలా, దబీరుల్ ముల్క్, నిజాం జంగ్ అనే బిరుదులు ప్రదానం చేసినారు అతని బాల్య కౌమారాలు ఆగ్రాలో మాతామహునింట గడిచినవి మాతా మహుడు జాగీర్దారే. అతని భార్య కూడా జాగీర్దారు లింటి ఆడపడుచే. ధనం లేకున్నా అతనిలో జాగీర్దారీ దర్పం వుండేది. అతడు అందరు కవుల లాంటి వాడు కాడు. కంపెనీ ప్రభుత్వం గౌరవం పొందిన జాగీర్దారు గవర్నర్ గానీ, గవర్నర్ జనరల్ గానీ దర్బార్ జరిపితే నవాబ్ మిర్జా అసదుల్లా బేగ్‌ఖాన్ గాలిబ్‌కు జాగీర్దార్లు కూర్చుండే ముందు వరుసలో పదవ నంబరు కుర్చీ కేటాయించబడేది దానికి తగినట్టుగా ప్రవర్తించటం అతని కర్తవ్యం. దాన్నే 'వజే-దారీ' అంటారు. ఆ వజే-దారీని అతడు చివరిదాకా వదిలిపెట్టలేదు. కంపెనీ ప్రభుత్వం ఇచ్చే భరణం అతని ఆరుగురు దాసదాసీల జీతాలకు సరిపడేది కాదు తనకు అందరు దాసదాసీల అవసరము లేదు. వాళ్లను ఉద్యోగంలోంచి తీసివేస్తే వజే-దారీకి కళంకం. అతడు మానవతావాది కూడా కనుక వాళ్లు నిరాశ్రితులై పోతారనే బాధ. అటువంటి విలక్షణమైన వ్యక్తిత్వం కల గాలిబు విలక్షణమైన శైలిలో గజల్ రచన చేయటం వింతకాదు. పదుగురు నడిచే బాటలో నడవటం అతనికి పరువు చేటు. ఉర్దూ కవులు సాధారణంగా ఫారసీ కవులైన షేఖ్‌సాదీ, హాఫిజ్ షిరాజీ, అమీర్ ఖుస్రూల పద్ధతిని అవలంభించేవాళ్లు. గాలిబ్‌కు ఆ ఫారసీ మహాకవుల పట్ల గౌరవం లేదని కాదు. వాళ్ల పద్ధతిని అవలంభించదలచుకోలేదు. బేదిల్ అనే ఫారసీ కవి అర్థంగాని కవిత రాయటంలో ప్రఖ్యాతుడు. గాలిబు బేదిల్ పద్ధతిని ఆవలంబించినాడు. అందువలన అతని తొలినాళ్ల కవిత కఠిన పాకాన పడ్డది.

మిర్జాగాలిబ్ చరిత్రగతి నెరిగిన వాడు కాడు. అతడున్న కాలంలో మొగల్ చక్రవర్తులు ఢిల్లీ వరకే చక్రవర్తులు. వాళ్ల ప్రాబల్యం తగ్గినట్లే ఫారసీ భాష ప్రాబల్యం కూడా తగ్గింది. ప్రజల భాష అయిన ఉర్దూ ప్రాముఖ్యం పెరిగింది. అప్పటి కవులు ప్రజల భాషలో పద్యం రాసేవాళ్లు.

ఫారసీలో గద్యం రాసేవాళ్లు గాలిబు గద్యపద్యాలు ఫారసీలో రాస్తేనే ప్రతిష్ఠ కలిగిస్తాయని నమ్మినాడు. తన ఉర్దూ గజల్లు ఉబుసుపోకకు రాసుకున్నవే అని భావించేవాడు ఎవరైనా అతని ఉర్దూ గజల్లను మెచ్చుకుంటే '' ఉర్దూ గజల్ లో ఏమున్నది సోదరా! నాకు సిగ్గుగా వుంటుంది నా ఫారసీ గజల్ చదువు '' అనేవాడు ఏ ఫారసీ గజల్లు అతనికి కీర్తి కారణమవుతాయనుకున్నాడో వాటిని చదివేవాళ్లులేరు ఏ ఉర్దూ గజల్లు రాసినందుకు సిగ్గుపడ్డాడో ఆ ఉర్దూ గజల్లే అతనికి చిరకీర్తిని కలిగించినవి అతని అంచనా తప్పింది

అతనికి మిత్రుల మధ్య కూర్చుండి గంటలు తరబడి మాట్లాడుకోవటం సరదా అందులో కొందరు శిష్యులు, మరికొందరు అభిమానులు గాలిబు హాస్యప్రియుడు. సరస సంభాషణా చతురుడు. క్రీ శ 1857వ సం॥న జరిగిన సిపాయీల విప్లవం తరువాత ఢిల్లీలోని అతని మిత్రులు చెల్లా చెదరై తలో దిక్కుకు వెళ్లిపోయినారు అతడు పదిహేను నెలలు గృహనిర్బంధంలో వున్నాడు మిత్రులకు జాబులు రాస్తూ, జవాబులు తెప్పిస్తూ, ఆ కాలం గడిపివేసినాడు అతని జవాబులు సాంప్రదాయికశైలిలో కాక ముఖాముఖి ముచ్చట్లాడుకున్నట్లుంటాయి ఆ జాబులను ప్రచురించాలని కొందరు సంకల్పించినారు అందుకు గాలిబు సమ్మతించ లేదు తన పాండితీ ప్రకర్షను ప్రదర్శించే ఫారసీ గద్యరచనలను కాక కాలక్షేపానికి రాసిన జాబులను ప్రచురించటమేమని మందలించినాడు. అయినా కొందరు అతనికి తెలియకుండా కొన్ని జాబులను పుస్తక రూపంలో ప్రచురించినారు ఆ జాబులకు ఊహించని విధంగా ప్రజాదరణ లభించింది దేశం నలుమూలల నుండి ఆ పుస్తకం పంపవలసిందంటూ ఆర్డర్లు వచ్చినవి అదంతా గమనించిన గాలిబు తన జాబులు ప్రచురించదలచుకున్న వాళ్లకు తానే తోడ్పడ్డాడు అతని కాలంలోనే ఇంకో రెండు జాబుల సంపుటులు ప్రచురణ పొందినవి తరువాత మరికొన్ని ఇంకా అతని ఉత్తరాల అన్వేషణ సాగుతూనే వున్నది. ఉర్దూ ఉత్తరాల విషయంలోనూ అతని అంచనా తప్పింది. అతని కీర్తికి కారణమైనవి అతని ఉర్దూ గజల్లు, అతని ఉత్తరాలు

గాలిబును గురించి ఉర్దూలోను, ఇంగ్లీషులోనూ రాయబడినంత ఇంకే ఉర్దూ కవిని గురించి రాయబడలేదు

మిర్జాగాలిబు మద్యపానాసక్తి సర్వవిదితం అతడే తన కవితలో ఉత్తరాలలో ప్రచారం చేసుకున్నాడు. విలువైన విదేశీ మద్యమే తాగేవాడతడు. ఆ మద్యం కంపెనీవాళ్లు పంపేవాళ్లు, కొందరు హిందూ శిష్యులు తెచ్చిచ్చేవాళ్లు, డబ్బులున్నప్పుడు తానే కొనుక్కునేవాడు. లేనప్పుడు అప్పుపెట్టేవాడు. అప్పుల వాళ్లు అతన్ని కోర్టుకు కూడా లాగినారు. పానంతో పాటుజూదం జూదం కారణంగా మూడు నెలలు చెరసాలలో వున్నాడు గాలిబు. నవాబ్ ముస్తఫాఖాన్ షేఫ్తా గాలిబు శిష్యుడు, మంచి కవి. కంపెనీ ప్రభుత్వంలో పలుకుబడి కలవాడు అతడు అన్ని ఆపదల నుంచి గాలిబును తప్పించేవాడు. గాలిబు చుట్టూ చేరే పెద్దమనుషులైన విద్వాంసులు, ''అతడు గొప్ప విద్వాంసుడని వెళ్లేవాళ్లం త్రాగుబోతు జూదగాడని తెలిసిన తరువాత ఆ ఛాయలకు వెళ్లటమే మానుకున్నాం జైలుకు వెళ్లిన వానితో మీ లాంటి పరువు గల పెద్దమనిషికి ఇంకా

సంబంధమెందుకు?'' అని షేఫ్తాకు హితము చెప్పినారు. ''అతడు త్రాగుబోతు జూదగాడు. ఆ మాత్రమే మీకు తెలుసు. మీకు తెలియని చాలా బలహీనతలున్నాయతనిలో - ఐనా అతడు మహాకవి. మహామానవుడు. నాకు సర్వదా ఆదరణీయుడు. ఆరాధనీయుడు '' అని వాళ్ల నోళ్లు మూయించినాడు షేఫ్తా.

గాలిబు మొదటి ఆత్మకథ ''యాద్‌గారె - గాలిబ్''. రాసిన ఖ్వాజా అల్తాఫ్ హుసేన్ హాలీ గాలిబ్ శిష్యుడు. హాలీ అతన్ని వృద్ధాప్యంలో సేవించుకున్నాడు. తాను చూచింది, గ్రహించింది, అనుభవించింది రాసినాడు కనుక 'యాద్‌గారె.- గాలిబ్' ప్రామాణిక రచన హాలీ నిజాయితీ గల వ్యక్తి గాలిబ్‌గొప్పతనాన్నే గాక అతని లోపాలను సైతం ఉల్లేఖించినాడు లోపాలంటే మరేమీకాదు మద్యపానం, జూదం మాత్రమే. అవి రెండూ నవాబ్‌జాదాగా బాల్య కౌమారాలు గడిపినందు వలన అలవడినవి. గాలిబు మద్యపాన రసికుడేకాని, మద్యపాన వ్యసనుడు కాడు విలువైన విదేశీ మద్యాన్ని విధి విధానంగా తాగేవాడు.

మిర్జాగాలిబు అహంకారం గురించి కూడ చాలమంది రాసినారు ఆ అహంకారం అతనికి శోభించేదే. ఎంతటి అహంకారమో అంతకుమించిన వినయం వుండేది మీర్ తర్వాత తానే ఉర్దూలో గొప్పకవి ననుకునేవాడు గాలిబ్. దాన్ని ఇప్పటికీ ఎవరూ కాదనలేరు. ఎవరి కవితలో మంచి కనిపించినా నిండు మనసుతో అభినందించే ఉదారబుద్ధి అతనిది.

అతని దృష్టిలో అన్ని మతాలూ సమానమే. తాను ముసల్మాను. కాని నమాజు చదివేవాడు కాడు. రోజాలు పాటించేవాడు కాడు. అట్లని నాస్తికుడూ కాడు సర్వ మానవులను ప్రేమించటమే అతని మతం. జాగీర్దారీ దర్పం సాటివాళ్లలోనే చూపేవాడు సామాన్యుల్లో అతి సామాన్యుడై కలిసిపోయేవాడు. ఆనాటి సూఫీయోగులు అతని విద్వత్తను, వినయ సంపదను, మానవతను, ఆధ్యాత్మికతను ప్రశంసించేవాళ్లు.

డా. అబ్దుల్‌రహమాన్ బిజనోర్ దృష్టిలో భారత దేశంలో నాలుగు వేదాల తర్వాత అవశ్య పఠనీయమైన గ్రంథం దీవానె-గాలిబ్. ''వంద పుటల ఈ సంకలనంలో లేనిదేమి?'' అంటాడు డా. బిజనోర్ అది అతిశయోక్తి.

డా. సయ్యద్ అబ్దుల్‌లతీఫ్ 'గాలిబ్' అనేతన ఆంగ్ల గ్రంథంలో ''గాలిబ్ కవితా సంకలనంలో శబ్దాడంబరం తప్ప ఏమీలేదు.'' అంటాడు. అది తొందరపాటు.

ఎందరు విమర్శించినా, ఎందరు ప్రశంసించినా గాలిబు కీర్తి పెరుగుతున్నదే కాని తరగటంలేదు.

మిర్జాగాలిబు క్రీ.శ. 1797వ సంవత్సరాన ఆగ్రాలో జన్మించినాడు. క్రీ.శ. 1869వ సంవత్సరాన దిల్లీలో మరణించాడు. బ్రతికినంతకాలం గౌరవంపొందినాడు. అవమానాలు చవిచూచినాడు. ఆర్థికపరమైన కష్టాలు చచ్చేదాక వదిలిపెట్టలేదతన్ని. దిల్లీలో యాభైయేళ్లున్నా సొంతయిల్లు కట్టించుకునే స్తోమత కలుగలేదతనికి.

# జిడ్డు కృష్ణమూర్తి దర్శనం

## (మే 11, 98 కృష్ణమూర్తి 103వ జయంతి)

– డా॥ జి. వేదపారాయణ

జీవితాన్ని లోతుగా పరిశీలించి సత్యాన్ని దర్శించిన ప్రపంచ ప్రఖ్యాత తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి గారు. తన దర్శనాన్ని యితరులతో పంచుకొని మానవజాతిని మేల్కొలిపేందుకు తన జీవితాన్ని అంకితం చేసిన బహుకొద్దిమంది తాత్త్వికులలో ఆయన ఒకరు. సత్యంలాగా ఆయన దర్శనము కూడ సార్వజనీనమైనది. ఆయన తత్త్వము మానవులదే కాని హిందువులదో, మహమ్మదీయులదో లేక క్రైస్తవులదో కాదు. ఏదో ఒక ముద్ర వేసుకొని, ఒక మూసలోవున్న వారికి ఆయన తత్త్వం మింగుడు పడదు. కట్టుబాట్లను, పక్షపాత దృష్టిని, సంకుచితత్వాన్ని విడనాడి తన్నుతాను నిశితంగా ప్రశ్నించుకోగల వారికే ఆయన తత్త్వం బోధపడుతుంది అధికారము, నమ్మకము, భయాలకు లోనైన మనస్సు సత్యాన్ని దర్శించలేదు మానవుణ్ణి అన్ని బంధాల నుండి సంపూర్ణంగా, నిరపేక్షంగా విముక్తుడను చేసి సత్యాన్ని సూచించడమే కృష్ణమూర్తి తత్త్వముఖ్యోద్దేశము పరిపూర్ణమైన, అర్థవంతమైన, వైయక్తిక, సామాజిక జీవనానికి సత్యదర్శనం తప్పనిసరి వ్యక్తి సత్యాన్ని దర్శించి సత్యవ్రతుడైతే తప్ప సుఖ శాంతులతో కూడిన సమాజము అసాధ్యము సమాజ మార్పుకు వ్యక్తి మార్పు అనివార్యము చట్టం, మతం, రాజకీయాలు సంఘాన్ని సంపూర్ణంగా మార్చలేవు

ప్రస్తుత జీవితము, ప్రపంచము ఎన్నోరుగ్మతలకు లోనైవున్నాయి. విభజన, ఘర్షణ, అసమానత, అన్యాయము, అవినీతి, పేదరికము, హింస, పర్యావరణ కాలుష్యము మొదలగు సమస్యలకు నిలయమయ్యాయి నాగరికత వెర్రితలలు వేస్తూంది అన్ని రంగాలలోను స్వార్థం పెరిగిపోతూంది. ధార్మికత, మతము కూడ వ్యాపారమైపోయాయి డబ్బు, కులం, పలుకుబడి, దౌర్జన్యాలు రాజ్యమేలుతున్నాయి. వైజ్ఞాన, సాంకేతిక పరంగా అభివృద్ధి సాధించినా మానవుడు మానసికంగా ఏమాత్రం ఎదగలేదు. అంతరిక్షంలో విహరిస్తూ యితర గ్రహాలపై అడుగిడినప్పటికీ తన అంతరంగాన్ని తాను అవగాహన చేసుకోలేకపోతున్నాడు. సోమరితనానికి, వినోదానికి బానిసైపోతున్నాడు. మెదడు యాంత్రికమై మొద్దుబారిపోతూంది వ్యక్తి తన్నుతాను పరిశీలించుకొనే సృజనాత్మక శక్తిని కోల్పోతున్నాడు. స్వార్థం, ద్వేషం, కపటం, అసూయ, క్రూరత్వం మొదలగు వినాశకర గుణాలను విడనాడలేదు తన ఆహ్లాదము, సుఖలాలస కొరకు సర్వాన్ని నాశనం చేస్తున్నాడు. మతము, జాతి, జాతీయత పేరుతో ఎడతెగని యుద్ధాలు చేస్తున్నాడు. అనూహ్యమైన ప్రాణ, వనరుల నష్టము జరిగినప్పటికీ రాబోయే యుద్ధాన్ని యింకా సమర్థవంతంగా, వినాశకరంగా చేయడానికి తయారవుతున్నాడు తన జాతిని తానే అంతంచేసుకొనే ప్రయత్నంలో, పరిశోధనలో నిమగ్నమై వున్నాడు. మానవుడు ఈ వినాశకర యుద్ధానికి వెచ్చించినంత వనరులను, కాలాన్ని, మేధస్సును మానవశ్రేయస్సుకు వెచ్చించడంలేదు న్యూట్రాను బాంబును తయారుచేయడానికి శ్రమించినంతగా ఆకలి, అసమానత, పేదరికాల్ని

★ డా. జి. వేదపారాయణ శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి, తత్త్వశాస్త్ర శాఖలో పనిచేస్తున్నారు.

రూపుమాపడానికి శ్రమించడం లేదు మానవ చరిత్రంతా ఒక కన్నీటిగాథ అంధకారబంధురము, దుఃఖసాగరము. ఇది మానవుని స్వయంకృతాపరాధము.

ఈ అజ్ఞాన పూరిత, విచక్షణారహిత జీవితానికంతా మానసిక స్థాయిలో గతముతో నిబద్ధమైన మనస్సే కారణం కంప్యూటరులాగా ఆలోచనచే నియంత్రించబడిన మెదడే ఈ సంక్లిష్టతకు మూలం. ఆలోచన రెండు స్థాయిలలో పని చేస్తుంది వ్యావహారికము మరియు మానసికము వ్యావహారిక స్థాయిలో ఆలోచన, భౌతిక అవసరాలకు కావల్సిన శాస్త్రీయ, సాంకేతిక, గణిత భాష మొదలగు విషయాలకు సంబంధించిన సహేతుక, యదార్థమైన జ్ఞానాన్ని, సమాచారాన్ని పెంపొందిస్తుంది ఇది అత్యంత అవసరము ఇది లేకుంటే జీవనము సాగదు. మానసిక స్థాయిలో ఆలోచన అనుభవాలనుంచి, మానవ సంబంధాలనుంచి జ్ఞానాన్ని సేకరించి మనస్సును నిబద్ధంచేస్తుంది ఈ జ్ఞానమంతా నమ్మకాలు, అభిప్రాయాలు, యిష్టాయిష్టాలు, కోరికలు, ద్వేషము, అసూయ, అలజడి, అభద్రత, అనిశ్చితత, పరాదీనత, భయము, దుఃఖము మొదలగు వాటి సమ్మేళనము స్వార్ధము, విభజన, ఘర్షణ, హింసా ప్రవృత్తి ఈ మానసిక జ్ఞానములోని భాగాలే ఇదే వ్యక్తియొక్క అహము, 'నేను', 'నాది' అన్నభావానికి ఆధారము వ్యక్తి జీవితంలో సమాజంలో వున్న అల్లకల్లోల, అయోమయ పరిస్థితికి ఇదే మూలము. మానసిక సంక్లిష్టతే ప్రపంచ సంక్లిష్టతకు ముఖ్యకారణం. కావున ఈ మానసిక జ్ఞానాన్ని కల్పిస్తున్న ఆలోచన అంతమయి సత్యదర్శనము కల్గితే తప్ప మానవుని జీవితంలో, తద్వారా సమాజంలో నిజమైన మార్పు జరుగదు

కృష్ణమూర్తి ప్రకారము, తత్త్వమంటే సత్యాన్ని ప్రేమించడము సత్యమంటే సంపూర్ణమైన స్వేచ్ఛనుపొందిన మనస్సు ఏ ఆలోచనాలేని అనంతమైన, అవిభాజ్యమైన మానసిక స్థితి సత్యము సత్యము సృజనాత్మక శూన్యస్థితి, అపారమైన శక్తి. దీనినే ప్రజ్ఞ అని కూడా అంటారు కృష్ణమూర్తి ప్రేమించడమంటే మాటలకు, భావాలకు, సిద్ధాంతాలకు అతీతంగా సత్యాన్ని దర్శించడము. అంటే ఆలోచనా ప్రమేయము లేకుండా సత్యాన్ని ప్రత్యక్షంగా చూడడము ఆలోచన అపరిపూర్ణము, సాపేక్షము, కాలమయము. కావున పరిపూర్ణమైన, నిత్యమైన, నిరపేక్షమైన సత్యాన్ని అది అవగాహన చేసుకోలేదు. అయితే ఆలోచనామయమైన మనస్సు సత్యాన్ని ఆలోచన ద్వారానే తెల్సుకొనే అసంగతమైన, అసాధ్యమైన ప్రయత్నము చేస్తూంటుంది. ఆలోచన సత్యాన్ని వూహించుకోగలదే కాని దర్శించలేదు. కావున ఆలోచన అంతమైనప్పుడే సత్యము ఆవిష్కరింపబడుతుంది.

మానసిక ఆలోచనా పరంపరను, వలయాన్ని అంతము చేయడానికి కృష్ణమూర్తిగారు ఎటువంటి పద్ధతులనుగాని, సాధనలనుగాని నిర్దేశించలేదు. పద్ధతులు, సాధనలు ఆలోచనా నిర్మితాలే. కాలపరిధిలోనివే వాటిలో కేవలము అనుకరణ, యాంత్రికతలే వుంటాయి. ప్రశ్నించడానికి, పరిశీలనకు ప్రత్యక్ష దర్శనానికి చోటులేదు. ఉన్న విషయాన్ని వున్నట్లుగా అవగాహన చేసుకోవడం వల్లనే సత్యం బోధపడుతుంది. అంటే ఆలోచన సత్యాన్ని దర్శించలేదు అన్న విషయాన్ని నిర్ద్వంద్వంగా, సమర్ధనగాని, నిందగాని లేకుండా సంపూర్ణంగా గ్రహించాలి.

ఆలోచనా స్వభావాన్ని, స్వరూపాన్ని, పరిమితులను ఎంపిక లేని ఎరుకతో (Choiceless Awareness) అవగాహన చేసుకుంటే అపారమైన శక్తి జనించి ఆలోచన అంతమై సత్యము ఆవిష్కరింపబడుతుంది ఆ ఎరుకతో మెదడు కణాలలోనే సమూలమైన మార్పు జరిగి సృజనాత్మకమైన శూన్యత ఏర్పడుతుంది ఈ శూన్యతే సత్యము సత్యము ఎవరికి వారు అవగాహన చేసుకోవలసిన విషయము. ఇందులో గురువుల మధ్యవర్తిత్వానికి తావులేదు. సత్యము ఒకరి సొత్తుకాదు. తీవ్రమైన ఆకాంక్షవున్నవారు ఎవరైనా సత్యాన్ని దర్శించవచ్చును. సత్యాన్ని దర్శించిన వ్యక్తి మనకు సత్యాన్ని సూచించగలడే గాని చూడవలసిన బాధ్యత పూర్తిగా మనపైనే వుంది. అజ్ఞానాన్ని పోగొట్టేది అంతర్ దృష్టేకాని గురువుకాదు. భయంతో యాంత్రికంగా గురువును అనుసరిస్తున్నంత వరకు సత్యమే అవగాహన కాదు అందుకే కృష్ణమూర్తిగారు తాను గురువును కాదని నిష్కర్షగా చెప్పారు. సత్యదర్శనం కావాలన్న చిత్తశుద్ధిగలవారు తనను గురువుగా భావించవద్దని మనవిచేశారు. సత్యదర్శనానికి అది ప్రాథమిక అవసరమని అన్నారు

సత్యదర్శనమైన మనస్సు గతం నుంచి విడుదలపొంది పరిపూర్ణమైన స్వేచ్ఛను కల్గివుంటుంది. నిత్యనూతనమై సజీవమైన ప్రస్తుత క్షణంలో జీవిస్తుంది అసలు జీవితము కాలానికి అతీతమైన ప్రస్తుతములోనే వుంది. ఆలోచనామయమైన భూత, భవిష్యత్తులలో లేదు స్వేచ్ఛగల మనస్సు అక్షయమైన భద్రత కల్గివుంటుంది దాని భద్రత శూన్యతలోనేగాని ఆస్తి, అంతస్తులు, జాతి, మతము, జాతీయతలలో కాదు సత్య స్వరూపమైన మనస్సు భయరహితము, నిరపేక్షము, అఖండము ఈ విశ్వమే తన ఇల్లు అది పరిపూర్ణమైన ఋతము కలిగివుంటుంది. ఆ ఋతము విశ్వ ఋతములో భాగమే. ఈ ఋతమే ధ్యానము ధ్యానమంటే ఆలోచన, కాలాలకు అతీతమైన విశ్వముతో మనస్సు సమ్మేళనము కావడమే విభజన, దుఃఖము ఎరుగని అనంత వాహిని ధ్యానము

సత్యము ఆవిష్కరింపబడినప్పుడు అంతమయ్యేది మానసిక ఆలోచన మాత్రమే. వ్యావహారిక ఆలోచనలో మార్పు వుండదు సత్యము నిర్జీవమూ, నిర్వీర్యమూ కాదు. ప్రజ్ఞా ప్రేమలతో కూడి వుంటుంది ప్రజ్ఞ వ్యవహారిక ఆలోచనను భౌతిక అవసరాలకు మాత్రమే వాడుకుంటుంది. మానసిక స్థాయికి ఆలోచనను రానివ్వదు. సత్యదర్శనం జరిగిన తరువాత మానసిక స్థాయిలో వుండేది ప్రేమకాని, ఆలోచనకాదు. సత్యంలాగే ప్రేమకూడా పరిపూర్ణమైనది ప్రేమకు ''నేను'' అన్న కేంద్రముకాని, హిందువు, మహమ్మదీయుడు, భారతీయుడు, పాకిస్తానీ అన్న పరిధులుకాని లేవు. ప్రేమ నిర్లిప్తము కాదు క్రియాశీలము ఏ వుద్దేశ్యమూ, ఫలాపేక్ష లేనటువంటి క్రియే ప్రేమ ప్రేమ ద్వేషానికి సాపేక్షము కాదు. అంటే ప్రేమ వున్నచోట ద్వేషము వుండదు. ప్రేమ చెడు చేయలేదు అది ఏమిచేసినా మంచిగానే వుంటుంది. ప్రేమ అన్నిటిపట్లా - మానవులు, ప్రకృతి, పశుపక్షాదులు, మొత్తం విశ్వం పట్ల బాధ్యతాయుతంగా వ్యవహరిస్తుంది ప్రేమలేని జీవితం అర్థరహితం. ప్రేమలేని ప్రపంచం సమస్యల వలయం ఘర్షణ, హింసా, యుద్ధము, దుఃఖాలకు అది నిలయము. ప్రస్తుత జీవితము, ప్రపంచము ప్రేమ రాహిత్యానికి గొప్ప నిదర్శనము సత్యదర్శనమే దీనికి పరిష్కారము. మానవులంతా సత్యాన్ని దర్శిస్తే ఈ ప్రపంచమే భూతల స్వర్గము తక్షణమే మానవుడు ఎన్నికలేని ఎరుకతో ఆలోచనను అంతంచేసి సత్యాన్ని దర్శించి ప్రేమ స్వరూపుడు కావడమే కృష్ణమూర్తి తత్త్వసారం.

# ''కీలుబొమ్మలు'' : ఒక పరిశీలన

- ప్రొ.సి. విజయశ్రీ

మొట్టమొదటి తెలుగునవల 1870లో ఆరంభమైన దశకంలో వెలువడి అప్పటినుంచీ, అది సమకాలీన సామాజిక, రాజకీయ సమస్యలపట్ల ప్రగాఢమైన నిబద్ధత కనబరుస్తూనే వుంది. సమాజ స్వరూపం యీ వంద సంవత్సరాల కాలంలో ఎంతవేగంగా మార్పుచెందినా, తెలుగునవల సమాజానికి దగ్గరగా వుంటూనే వచ్చింది, సామాజిక జీవితంలోని ప్రతి మార్పుని, స్పందనని అత్యంత సున్నితంగా చిత్రిస్తూనే వచ్చింది. కాగా, కథన పద్ధతి వాస్తవికత పునాదిగా రూపొందింది. వలస వాదం, భూస్వామ్యం, కులవ్యవస్థాతత్వాలు, పితృస్వామ్య భావజాలాలతో సహా అన్ని విధాలైన అధికార తత్వాలనూ, నిరంకుశ ప్రవృత్తులనూ విమర్శించడానికి తెలుగు నవల ఒక వేదిక అయింది. ఇక, స్వాతంత్ర్యానంతర కాలంలో - నూతన ప్రభుత్వం, పాలనా విధానం, దానిలో సర్వత్రా వ్యాపించిన అవినీతీ - ఇవి కల్పనా సాహిత్యానికి ప్రధాన యితివృత్తాలైనాయి దాదాపు ఇదే సమయంలో తెలుగు నవల ప్రయోగాత్మక దశను చేరుకొంది అప్పటికి నవలారచయితలు ఫ్రాయిడ్ మనస్తత్వ విశ్లేషణ, మార్క్స్ సామ్యవాదం, యూరప్ ఖండంలోని అస్తిత్వవాదం వంటి ప్రముఖమైన సిద్ధాంతాల చేత ప్రభావితులైనారు. పాశ్చాత్యుల ఆధునిక కాల్పనిక సాహిత్యం ఒకప్రక్క, స్వదేశంలో ప్రజాదరణ పొందిన అభ్యుదయ రచనోద్యమం మరోప్రక్క మేధావుల సృజనాత్మకతని ప్రభావితం చేశాయి జి వి కృష్ణారావు గారి 'కీలుబొమ్మలు' (1951) ఈ దశకు చెందినదే కాక, సాహిత్యంలో వచ్చిన ఆనాటి మార్పులన్నిటినీ ఆవిష్కరిస్తుంది.

కవీ, నాటకకర్తా, నవలాకారుడూ, విమర్శకుడూ అయిన కృష్ణారావు గారు నాటి రాజకీయ, సామాజిక సమస్యలపైన నిశితమైన సాంఘిక స్పృహతో రచిస్తాడు. ఆయన తన చుట్టూవున్న రాజకీయ, సామాజిక సంబంధాల్లో వచ్చిన క్లిష్టమైన మార్పులపైన మాత్రమే దృష్టిని కేంద్రీకరించకుండా, మార్పు చెందుతూన్న యీ దశలో జీవించిన స్త్రీ, పురుషుల మానసిక సంఘర్షణలనూ, నైతిక సందిగ్ధతలను కూడా గణనలోకి తీసుకుంటాడు. ప్రగతిశీలమైన సంస్కరణాత్మక సందేశం ఒకటి ఆయన నవలల్లో కనిపిస్తుంది ''సంపూర్ణ మానవుడు'' ఆవిర్భవించడానికి వ్యక్తిగతమైన స్వేచ్ఛ అవశ్యకమని కూడా ఉద్బోధిస్తాడు

'కీలుబొమ్మలు' లో మనస్తత్వ పరంగా, అభ్యుదయపరంగా స్వాతంత్ర్యానంతర రాజకీయాలను కృష్ణారావు పరిశీలిస్తాడు. కొత్తగా స్వతంత్ర్యాన్ని పొందిన దేశంలో నైతిక విలువలెలా దిగజారిపోయాయో ముఖ్యంగా అనుశీలన చేస్తాడు. 'కీలుబొమ్మలు' అనే పేరులోనే మానవ జీవితంలోని యాంత్రిక స్వభావం ధ్వనిస్తుంది ఈ యంత్రాన్ని నడిపే మరలు అవినీతిమయమైన సమాజం అధీనంలో వుంటాయి. వైయక్తికమైన ఆలోచనలూ, కార్యనిర్వాహక శక్తీ కనబడకుండా పోయేంతగా వ్యక్తుల జీవితాలు సామాజికంగా, సాంస్కృతికంగా, మానసికంగా శాసింపబడతాయి. స్త్రీ, పురుషులు కేవలం కీలుబొమ్మల స్థాయిలో మిగిలిపోతారని ఈ ప్రబోధాత్మక కథ తన సందేశాన్ని నిర్ద్వంద్వంగా ప్రకటిస్తుంది. డా. వాసుదేవశాస్త్రి (యీ కథలోని ఒకపాత్ర) అంటాడు. ''సమాజంలోని స్త్రీ, పురుషులు స్వతంత్రంగా ఆలోచించడమూ, ఆత్మప్రబోధం ప్రకారం నడుచుకోవడమూ చేయలేకపోతే, యీ సంఘానికి ప్రగతి శూన్యం ''

★ **ప్రొ.సి. విజయశ్రీ** ఉస్మానియా కోఠి
స్త్రీల కళాశాలలో ఆంగ్లశాఖలో పనిచేస్తున్నారు.

ఈ నవలకు రాసిన ప్రస్తావనలో కృష్ణారావుగారు ఈ రచన ఏ రాజకీయ పార్టీనిగానీ ఉద్దేశించి చేసింది కాదనీ, దీనికి స్వచ్ఛమైన కళానుభూతే ప్రధానమనీ రాశారు. పార్టీ ఆవేశాలను మరచి, నిష్పక్షపాత వైఖరితో యీ నవలను చదవమని పాఠకులను కోరుతారు. అయినప్పటికీ యీ యితివృత్తమూ, కథనంలో ధ్వనించే రచయిత కంఠమూ కూడా కృష్ణారావుగారు సోషలిస్టు సిద్ధాంతం చేత ప్రభావితులయ్యారని స్పష్టం చేస్తాయి.

దొంగ సంతకం చెయ్యడం వల్ల వచ్చే ఫలితాలను చిత్రించే జొహాన్ బోజర్ రచన 'ది పవర్ ఆఫ్ ఎలై' (1903) ఈ నవలకు ప్రేరణ కలిగించిందనవచ్చు. ఒకసారి చెప్పిన అబద్ధం నిర్నిబంధంగా ముందుకు సాగుతూ, ఆ మార్గంలో వున్నవారందరినీ ఎలా తప్పుదారి పట్టిస్తుందో కృష్ణారావుగారు చిత్రిస్తారు గ్రామంలో మర్యాదస్థుడైన ఒక మోతుబరిరైతు పుల్లయ్య కాయితాల మిల్లుకోసం చంద్రశేఖరం చేసిన అప్పుకి పూచీ పడతాడు కానీ చంద్రశేఖరం వ్యాపారం ఒడిదుడుకుల్లో పడగానే, పుల్లయ్య తను తెలివి తక్కువ పనిచేసినట్టు గ్రహించి పశ్చాత్తాప పడతాడు ముఖ్యంగా యీ సంఘటనకి తన భార్య ఎలాప్రతిస్పందిస్తుందోనని బాధపడతాడు. అందుకే తన కూతురు సీత యీ విషయమై ప్రశ్నించినప్పుడు, ఊసుపోని కబుర్లకి ప్రాముఖ్యం యివ్వగూడదని ఒక పాక్షిక సత్యం చెప్పి తప్పించుకుంటాడు

పుల్లయ్య పతనానికి యిది నాంది పతనం ఆరంభమయ్యాక దాన్ని ఆపడం దుస్సాధ్యమవుతుంది పుల్లయ్య భార్య చంద్రశేఖరం మీద ఫోర్జరీకేసు పెడుతుంది. ఇద్దరు వ్యక్తుల మధ్య వచ్చిన తగాదా - ఊళ్లోని ప్రజలంతా ఏదో వొక పక్షాన చేరి అగ్నికి ఆజ్యం పోయడంతో - గ్రామ సంఘర్షణగా పరిణమిస్తుంది పాతకక్షలు తీర్చుకోవడానికి ఇదొక అవకాశంగా కూడా మారుతుంది ఇలా - ప్రతివ్యక్తిగత వివాదం కూడా సామాజిక సమస్యగా రూపొందుతుంది. అరాచకం విలయతాండవం చేసే ఆదశలో - హింస, రక్తపాతం, దహనాలు, హత్యలు ఆగ్రామాన్ని కుదిపివేస్తాయి చిట్ట చివరకు అసత్యం తన శక్తిని చాటుకుంటుంది నిరపరాధికి శిక్షపడి, దోషి విడుదల అవుతాడు పుల్లయ్య ప్రజల మనిషిగా, 'సర్దార్ పుల్లయ్య'గా పరిణామం చెందడం, (మంత్రిగారు) అతడి వర్ణచిత్రాన్ని ఆవిష్కరించడంతో నవల వ్యంగ్యాత్మకంగా ముగుస్తుంది.

'కీలుబొమ్మలు' నవలను భావప్రధానమైన నవల (a novel of ideas) గా అభివర్ణించవచ్చు. కారణం, యీ నవలా కారుడు నవలలోని చాలా పాత్రలను ఏదోవొక సాంఘిక, రాజకీయ భావానికి చెందినట్టుగా చిత్రించారు ఈ నవలలోని స్త్రీ, పురుషపాత్రలు స్వాతంత్ర్యానంతర కాలంలో కనిపించే వ్యక్తిత్వాలకు నమూనాలుగా వుంటాయి (1) చంద్రశేఖరం లాగా సోషలిస్టు ఊహాస్వర్గం పట్ల ఆకర్షితులై, ఆచరణ స్థాయిలో ఘోర పరాజయం పొందే యువకులు, (2) అమ్మాయమ్మ గారిలా ప్రజల సమస్యలను స్వార్థప్రయోజనాలకు ఉపయోగించుకునే కొత్త తరం స్త్రీ కార్యకర్తలు, (3) 'విభజించి పాలించు' అనే సిద్ధాంతం మీదనే బలం పుంజుకునే పుల్లయ్య, మల్లయ్య వంటి భూకామందులు, (4) దృఢమైన నమ్మకాలున్నా అన్యాయాన్ని ఎదిరించడానికి చాలినంత ధైర్యం లేని సత్యనారాయణ పంతులు లాంటి - క్రమేణా అదృశ్యమవుతున్న జీవకోటికి చెందిన - నమ్మకస్థులు, (5) సంప్రదాయపు సంకెళ్ళ నుంచి బయట పడాలని కోరే పద్మలాంటి నిరాశ నిండిన మధ్యతరగతిస్త్రీలు, (6) వాసుదేవశాస్త్రిలా గాంధేయ సిద్ధాంతంతో ప్రభావితులై నిరాశనీ, అపజయాన్ని ఎదుర్కొంటున్న అల్ప సంఖ్యాకులైన ఆదర్శవాదులు, (7) రామారావులా మౌలికమైన సంస్కరణలు వాంఛిస్తున్న ఆవేశపూరితులైన యువకులూ - ఇలాంటి పాత్రల ద్వారా

కృష్ణారావుగారు మనకు తెలిసిన సంఘంలోని క్లిష్టతను - వ్యక్తిగతమైన సాంఘిక సంబంధాల పరిధిలో - అన్యాపదేశంగా వివరిస్తారు

ప్రతిపాత్రయొక్క అంతశ్చేతనను సున్నితంగా విశ్లేషించడమే నాడు ప్రజాదరణ పొందిన తెలుగు సాంఘిక నవలలకూ, కృష్ణారావు గారి నవలలకూ గల తేడా తన పాత్రల వ్యక్తిగత ప్రపంచం గురించీ, దృష్టి గోచరం కాని వాటి ఆంతర జీవితాల గురించీ స్పష్టమైన అవగాహన కలవాడీ రచయిత అంతేకాక, ఈ పాత్రల ఆంతరిక ప్రపంచం సాంఘిక నమ్మకాలకు ఎలా ప్రతిస్పందిస్తుందో కూడా అవగతమైననాడు ఏ పాత్రా సాంప్రదాయికమైన అర్థంలో కథానాయకుడు గానీ, ప్రతినాయకుడు గానీ కాదు, కానీ ప్రతి ఒకడూ బాధితుడు - తన జీవితాన్ని నియంత్రించే నిర్దాక్షిణ్యమైన వ్యవస్థ చేత బాధితుడు ప్రతి ఒకడూ ఒకకీలుబొమ్మ - నైతిక బాధ్యత లేని సంఘం లయబద్ధంగా లాగే తాళ్లకు అనుగుణంగా దేహభాగాలను కదిపే కీలుబొమ్మ ఉదాహరణకు పుల్లయ్య తన తప్పుడు కేసును కొనసాగిస్తూనే తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురి అవుతాడు. నిద్రలేమి, దోషభావన, కావాలని తననెవరో హింసిస్తున్నారనే భ్రమ, భయం అతణ్ణి వెంటాడుతూనే వుంటాయి తన ఉనికి కోసం లెక్కలేనన్ని అబద్ధాలని సృష్టించుకొని, తన వంచనని హేతుబద్ధంగా సమర్థించుకొని, గ్రామం మంచి కోసం తను న్యాయమైన పోరాటం చేస్తున్నాని తన్ను తాను వంచించుకుంటాడు సంఘంలో పరస్పరం సంఘర్షించుకునే వివిధ అంగాల మధ్య గల సంక్లిష్టత - ఈ విధంగా పాత్రల మనస్తత్వాలలోనూ, వారిమధ్యగల సంబంధాలలోనూ, యిష్టానిష్టాలలోనూ ప్రతిఫలిస్తుంది ముఖ్యంగా సాంఘిక సమస్యలుగానీ, వ్యక్తిగత సమస్యలుగానీ ప్రాముఖ్యం వహించినప్పుడు

కృష్ణారావుగారి భాష గ్రాంథిక భాషనుండి క్రమంగా వ్యావహారిక భాషకి మారే దశకి చెందినది రచయిత వ్యావహారిక భాషపట్ల మొగ్గు చూపినా, గ్రాంథిక శైలిపట్ల మక్కువ కనబరుస్తాడు. ఆయన శైలిలో కవితాత్మకత గానీ, శబ్దాడంబరంగానీ వుండవు నిరలంకారమైన భాషని ప్రయోగించి గణించ దగ్గ ఫలితాలనిసాధిస్తాడు నిర్మొగ మాటంగా సామాజిక రుగ్మతలను బహిర్గతం చేసే వ్యంగ్య పూరితమైన కథకు అద్భుతంగా అమరింది యీ శైలి

ధర్మచ్యుతిని అన్యాపదేశంగా వివరించే కల్పిత సాంఘిక గాథగా (Social allegory) దీన్ని భావించవచ్చు మంచీ, చెడుల మధ్య సంఘర్షణకు దృష్టాంతంగా మహాభారత కథని నవలలో అప్పుడప్పుడూ ఉదాహరించడం జరుగుతుంది. అయితే పురాణ కాలాల్లో లాగా యిక్కడ మంచికి విజయం లభించదు, చెడుగెలుస్తుంది. అయితే ఆ విజయం నిజమైనదో కాదో పాఠకులే నిర్ణయించాలి! ఎప్పుడైనా జీవనక్రమం తారుమారైతే, దైవం జోక్యం చేసుకుంటాడని పవిత్రగ్రంథాలు, పురాణాలూ ఘోషిస్తాయి. కానీ యిక్కడ ధర్మరక్షకుడైన వాసుదేవ శాస్త్రి - తన గ్రామం పతనానికి సమీపంగా వున్న తరుణంలో దాన్నివదిలి వెళ్లిపోతాడు. తరుణోపాయం గల భావజాలం గానీ, కథానాయకుడు గానీ యీ కథకి లేనందువల్ల, పూర్వనిర్దిష్టమైన అంతం వేపు యీ నవల ఏకోన్ముఖంగా నడుస్తుంది. ఇచ్ఛాశక్తి అంటే భౌతిక ప్రతిక్రియస్థాయికి దిగజారుతుంది, తాడు లాగినప్పుడే మనిషి కండరాలని కదిపినట్టు, రొబోట్‌లాంటి యాంత్రిక మానవులు జీవించే భీతావహమైన భవిష్యప్రపంచాన్ని దృగ్గోచరం చేస్తారు కృష్ణారావుగారు యీ నవలలో స్వార్థపరత్వం యొక్క శిఖరాల్ని చూపడంలో కొంతవరకూ ఆర్వెల్ నవలలను పోలివుంటుందీ నవల.

# కోయిల మధుర నాదంలో ... ... ...

- కొండిపర్తి శేషగిరిరావు

సౌందర్యం

మాధుర్యం

అన్నవి వస్తువులోనూ పదార్థంలోనూ ఉండవు అవి రసజ్ఞతలో ఉంటాయి.

ఇది సిద్ధమైన ఉన్న సౌందర్య తత్వాన్ని గురించి చేసే మీ మాంస

నిజానికి సౌందర్యం అన్నది ప్రాకృతికమైన వస్తువులోనూ, దానిని స్వీకరించే రసజ్ఞతలోనూ ఉండి, అది ఉభయ చర జీవిగా ఉంటుంది

అందుకనే

సౌందర్య తత్వజిజ్ఞాస అన్నది ఒకోసారి - రూపొందిన కళ, దాని మూల ప్రకృతి వైపునకూ, మూల ప్రకృతి కళా సృజనలోకి జొరబడిన విధానంవైపునకూ, సాగుతూ ఉంటుంది

అలాంటి దశలో -

ఈ జగత్తులో ఎంతో మధురంగా కూయగల పక్షులూ, అందంగా అరవగల జంతువులూ ఎన్నో ఉన్నాయి అలాంటి వాటిల్లోనుంచి కోయిలనీ, దాని కుహూరవాన్నే సంగీత కళ యొక్క మాధుర్యానికి ఉపమానంగానూ, ప్రమాణంగానూ తీసుకుంటారు అలా ఎందుకు తీసుకోవాలి అని ఆలోచిస్తే

అప్పుడు ప్రత్యక్షమౌతాయి వాద్యాలకు పెట్టే శృతిలోని నాదమూ - కోయిల కంఠంలోని నాదమూ, అప్పుడు అవి రెండూ ఒకదాని సరసన మరొకటి యుగళనాదం చేస్తూ దర్శనమిస్తాయి పరిశీలకులకు



ఓ వాద్యాన్ని కమ్మగా వాదనము చేయాలంటే, దానికి కమ్మగా శృతి పెట్టాలి. ఆ శృతి చేయటంలోనే ఆ వాద్యము యొక్క మాధుర్యం ఆధారపడి ఉంటుంది ఆ శృతిలో మాధుర్యం రావాలంటేమొదట శృతికి ఆధారంగా తీసుకొనే 'స' (షడ్జమ) ధ్వనిలో, అటు గౌళ (బొంగురు) దనమూ, ఇటు సన్నవిడి (సన్నని) దనమూ కలిగిన ఓ సమగుణము గల నాదములో షడ్జమాన్ని (స) నిలపాలి. ఆ నాదములో ఓ రకమైన గండుదనము ఉండాలి ఆ గండుదనములో కొంత మధురమైన గౌళతా, మరికొంత సన్న విడితా ఉండాలి. అంతేకాదు, ఆ నాదం ఓ మధురమైన తాదాత్మనా సూక్ష్మతత్వాన్ని కూడా కలిగి ఉండాలి అప్పుడుగానీ సంగీత వాద్యం మధురంగా గానం చేయలేదు ఈ లక్షణంగల శృతి నాదతత్వము ఏ శృతికైనా శృతి తియ్యదనం కోసం వాద్యానికి అమర్చక తప్పదు. అప్పుడుగానీ ఆ నాదము మధురంగా గంభీరంగా ఆ వాద్యానికి అమరదు అప్పుడు ఉద్భవించిన ఆ మధుర షడ్జమ (స) ధ్వని ఆధారముగానే ఇటు 'ప' (పంచమ) ధ్వని తీపి దనమూ ఆధారపడి ఉంటుంది. ఈ స-ప-స ల తియ్య దనాలను బట్టే త్రి స్థాయిలలోని స్వరాల తీపి దనాలు, రాగాల మధురిమలూ, గమకాల రసతన్మయతలూ ఆధారపడి ఉంటాయి

ఈ వాద్యానికి ఈ శృతిలో ఇంతకన్నా కమ్మని శృతిని పెట్టలేము ఈ శృతిలో ఏ తీగెను కాస్త

అటు కదిపినా ఇటు కదిపినా ఆ నాదంలోని తియ్యదనం కటుదనం అవుతుందే తప్ప తియ్యదనం రాదు అని అనిపిస్తుందో; అది కోయిల కంఠనాదంవలె, అటు గౌళదనాన్నీ ఇటు సన్నా విడిదనాన్నీ కలిగిన మధుర గంభీరనాదం ఔతుంది.



కోయిల కంఠనాదంలో తియ్యగా గండుదనమూ, మధురంగా ఉండే సన్నావిడిదనమూ ఉండటమే కాక, ఈ రెంటి మేళవింపువలన కలిగిన సమనాద మధురనాద గుణాత్యాల్ని కూడా కోయిల కంఠనాదం కలిగి ఉన్నది అంతేకాదు, అది ఎంతో తన్మయత్వాన్ని కలిగిస్తూ ఉంటుంది కూడా.

అలాంటి ఈ కుహూ . . ... కుహూ ....... రవాన్ని కనుక ఇంకా జాగ్రత్తగా పరిశీలిస్తే-

ఈ కోయిల కూతలో, మధ్యమ షడ్జమాల దగ్గర బయలుదేరి తారస్థాయి షడ్జమము (స) దగ్గర ఆగినట్లు అనిపించే ఆరోహణ లక్షణ ఛాయకూడా, ఈ కోయిల కుహూరవ గమన స్వభావంలో ఉన్నది. అలానే ఒకోసారి ఈ కుహూ రవములో అతి అరుదుగా అవరోహణ కూడా ఉన్నట్లనిపిస్తుంది. అంతేగాక ఈ కోయిల కుహూ . . .. కుహూ రవముల మధ్య ఎంత విరామకాలాన్నయితే తీసుకుంటుందో, అదే కొలమానం గల కాలాన్నీ దాని సమగతినీ, ఈ కోయిల చివరి కుహూ వరకూ తీసుకొని దాన్ని ఓలయగా నిలుపుకొంటూ వస్తుంది అంటే ఏ జంతు పక్షులలోనూ లేని, ఓ సుశిక్షితమైన లయ జ్ఞానాన్ని కూడా సహజంగానే ఈ కోయిల కలిగి ఉన్నదని తెలుస్తుంది.

అంతే కాకుండా, ఈ కోయిల కుహూరవాన్ని ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే, భారతీయ సంగీత కళలోని నాద సౌందర్యానికి మూలమూ, భావవ్యక్తీకరణలోని భావపుష్టికీ జీవమూ అయిన 'గమకము' అన్నది ఈ భారతీయ పక్షి 'కోయిల'కి మాత్రమే ఉన్నది అని అనిపిస్తుంది.

ఈ కోయిల 'కుహూ' రవాన్ని ఎంతో జాగ్రత్తగా పరిశీలించినప్పుడు గానీ ఈ విషయము మనకు బోధపడదూ, స్పష్టమవదు. సంగీత కళలో గమకము ఎలా ఓ స్వరస్థానము దగ్గర బయలుదేరి, ఆ పై స్వరము వరకూ లాగబడి, తిరిగి బయలుదేరిన స్వరస్థానము దగ్గరకు వచ్చి ఎలా నిలబడుతుందో, అదే సంచార లక్షణము ఈ కుహూ రవములో ఉన్నది. లేకపోతే 'కూ' అనే గమకరహితమైన పొడి స్వరముగానే కోయిల కూత మిగిలిపోయి ఉండేది. ఈ కోయిల కూడా అన్ని పక్షుల మాదిరిగానే మిగిలిపోయి ఉండేది.

కనుకనే. ఈ కోయిలను భారతీయ ఆదర్శరామణీయ సంగీత కళాజగత్తులోని మధురిమకూ, లయకూ ఎలాంటి అపవాదములేని రసనాద ప్రమాణంగా సంగీత రసజ్ఞులు తీసుకున్నారు అని అనిపిస్తుంది.

అందుకనే సౌందర్య తత్వ జిజ్ఞాస అన్నది ఒకోసారి, రూపొందిన కళా దాని మూల ప్రకృతి వైపుకూ, మూల ప్రకృతి కళాసృజనలోకి జొరబడిన విధానం వైపునకూ ప్రయాణం చేస్తూ ఉంటుంది.

సౌందర్య సాంకేతికాంశం కొరకు

ఈ రస మీమాంసా జగత్తులో......

స్వప్న మనోవిజ్ఞాన శాస్త్రం

# స్వప్నలిపిని పరిష్కరించగలమా?

– శశిశేఖర్

అనాదిగా మనుష్యులు కలలకు అర్థం వేదికే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. కలలు భవిష్యత్ ఘటనలను సూచిస్తాయనే నమ్మకం అన్ని జాతుల పురాణగాథలలోనూ కనిపిస్తుంది ఈ శతాబ్దం మొదటలో ఫ్రాయిడ్ తన ''స్వప్నవివరణ'' అనే గ్రంధం ద్వారా మొట్టమొదటి సారిగా కలల అంతరార్థాన్ని వివరించే ప్రయత్నం చేశాడు కలమనిషి అంతఃప్రపంచపు లోతులను స్పృశిస్తుందనీ, సుప్త చైతన్యాన్ని చేరుకొనేందుకు స్వప్నం రాచబాటనీ, నిద్ర చెదిరి పోకుండా ఉంచడం కల ముఖ్య ప్రయోజనాలలో ఒకటనీ ఫ్రాయిడ్ ప్రతి పాదించాడు

ఫ్రాయిడ్ స్వప్నవివరణం చేసేనాటికి నిద్రావస్థలో మెదడు పనిచేసే తీరు గురించి వివరంగా తెలియదు. 1953లో మొదటిసారిగా శాస్త్రజ్ఞులు నిద్రలోని వివిధ దశలను గుర్తించారు దీనికోసం వారు EEG (Electro Enceaphalo Graph) పరికరం మీద ఆధారపడ్డారు ఈ పరికరం మెదడులోని విద్యుత్ క్రియాశీలతను తరంగాల రూపంలో పసిగడ్తుంది ఈ తరంగ చిత్రాన్నే EEG అంటారు

భావశకలాలతో కూడిన ఆలోచనలతో ప్రారంభమయిన నిద్ర కొద్ది నిమిషాలలోనే గాఢనిద్రగా మారుతుంది గాఢ నిద్రలో విద్యుత్తరంగాల సంఖ్య తక్కువగానూ, వాటి వెడల్పు ఎక్కువగానూ ఉంటుంది. దీన్నే అల్పతరంగ నిద్రావస్థ అంటారు సుమారు 90 నిమిషాల గాఢనిద్ర తరువాత కలలకు కారణ భూతమైన REM (Rapid Eye Movement) నిద్రావస్థ మొదలవుతుంది ఈ రెమ్ దశలో కను గ్రుడ్లు వేగంగా కదలడం, ఉచ్ఛ్వానిశ్వాసలు అవకతవకగా ఉండడం, గుండె కొట్టుకొనేరేటు ఎక్కువ అవడం కూడా జరుగుతుంది ఈ దశలో మెడనరాలు తాత్కాలిక పక్షవాతానికి గురవుతాయి. అంటే శరీర కదలికల నిరోధం జరుగుతుంది. ఇదే జరగకపోతే కలనే నిజమని భ్రమించిన మనిషి ఆ 'నిజాన్ని' ఎదుర్కొనేందుకు సన్నద్ధుడయ్యే ప్రమాదముంది. రెమ్‌దశలోని EEG కొంతవరకు మెలకువ స్థితిలోని EEGని పోలి ఉంటుంది అంటే కల వాస్తవానికి మరో పార్శ్వమన్న మాట

మొదట కేవలం పదినిమిషాలు మాత్రమే ఉన్న స్వప్నావస్థ ప్రొద్దుపోయేకొద్దీ మరింత తక్కువ వ్యవధిలో మరింత ఎక్కువ సేపు పునారావృత మౌతుంది. ఆఖరుగా మెలకువ రాబోయే ముందు మనం కలలోంచి సరాసరి ఇలలోకి అడుగుపెడతాం రెమ్ దశలో ఉన్న వ్యక్తులను ఇఇజి పరికరం ద్వారా గుర్తించి, అప్పుడు వారిని నిద్రలేపినపుడు వాళ్ళు కలగంటున్నట్టు చెప్పారు

రెమ్ నిద్ర కేవలం ఎదిగిన వ్యక్తులలోనేకాక పసిపాపాయిలలో కూడా గమనించారు. పసిపిల్లలు పెద్దలకంటే ఎక్కువగా అంటే దాదాపు 8 గంటలసేపు కలగంటారు. ఆ మాటకొస్తే స్తన్య

★ **శశిశేఖర్** వి.యస్.ఆర్ & యన్.వి.ఆర్ కళాశాలలో
రసాయన శాస్త్రశాఖలో పనిచేస్తున్నారు.

జీవులన్నిటిలోనూ రమ్ నిద్ర ఉన్నట్టు శాస్త్రజ్ఞుల పరిశోధనలో తేలింది కాబట్టి కలగనటం కేవలం మనిషికి మాత్రమే పరిమితమైన అనుభవం కాదు. జంతువులు కూడా కలగంటాయి ఇటీవలి పరిశోధనల ప్రకారం గర్భస్థ శిశువు కూడా స్వప్నిస్తుంది.

జీవ పరిణామంలో ప్రతిమార్పుకూ ఒక ప్రాముఖ్యత ఉంటుంది. అసలు ఈ కల గనటం (లేక రెమ్ నిద్ర) ఎప్పుడు ప్రారంభమయినట్టు? మనకు తెలిసీ ఎకిడ్నా అనే గుడ్లుపెట్టే స్తన్యజంతువుకు నిద్రలో రెమ్ దశలేదు. ఎకిడ్నా సుమారు 140 మిలియన్ల సంవత్సరాల క్రితం పరిణామం చెందింది. అంటే జీవ పరిణామ క్రమంలో జీవి కలగనటం ప్రారంభించి సుమారు 14కోట్ల సంవత్సరాలయ్యింది.

రెమ్ నిద్ర ప్రయోజనం గురించి శాస్త్రజ్ఞులు అనేక రకాల సిద్ధాంతాలు ప్రతిపాదించారు హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన హాబ్సన్, మెకార్లేలు ''క్రియాత్మక సంశ్లేషణ'' అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. వీరి సిద్ధాంతంప్రకారం రెమ్‌నిద్రావస్థలో మెదడు చివరి భాగం నుంచి కొన్ని సంకేతాలు మెదడులో దృష్టిని నియంత్రించే కేంద్రాన్ని చేరతాయి ఇదే సమయంలో జ్ఞాపకశక్తిని నియంత్రించే హిప్పోకాంపస్ అనే మస్తిష్క విభాగంలో ఒకప్రత్యేక తరహాతరంగాలు ఏర్పడతాయి వీటిని తీటాతరంగాలు అంటారు. మెదడు చివరిభాగాంనుంచి మొదలయిన సంకేతాలు అంతిమంగా ఆలోచనలకు కారణభూతమయిన మెదడు ముందుభాగాన్ని చేరతాయి. ఈ గజిబిజి సంకేతాలకు ఒకరూపం ఇవ్వటం ద్వార ఈ భాగం దాన్ని ఒక కలగా మారుస్తుంది. ఎన్నడో మరిచిపోయిన అనుభవాల పోగులోంచి ఒకకొత్త అల్లిక అల్లడంద్వారా ప్రీ ఫ్రంటల్ కార్టెక్స్ అనే మస్తిష్క విభాగం కలకు రూపకల్పన చేస్తుంది అయితే అంతిమంగా ఈ అల్లిక ప్రయోజనం ఏమిటన్న ప్రశ్నకు హాబ్సన్, మెకార్లేలు సంతృప్తికరంగా సమాధానం చెప్పలేక పోయారు.

జన్యు రహస్యాన్ని బేధించిన శాస్త్రవేత్తలలో ఒకరైన క్రిక్, మిచ్‌సన్ అనే శాస్త్రవేత్తతో కలిసి 1983లో స్వప్న వివరణ, చేసే కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. దీని ప్రకారం మానవ మస్తిష్కంలో ఆలోచనకూ, అనుభూతికి ఆధార భూతమైన నియోకార్టెక్స్ అనే భాగం అనుక్షణమూ అపారమైన సమాచార సేకరణకు గురవుతూ ఉంటుంది. ఈ సమాచార భారాన్ని మోయలేక అది ఒక్కొక్క సారి అసంబద్ధమైన ఆలోచనా శకలాలను సృష్టించవచ్చు. పరాన్న భుక్కులవంటి ఈ ఆలోచనా ప్రవహానికి ఆనకట్ట వేయకపోతే అవి కొద్ది సమయంలోనే తామర తంపరగా పెరిగి మనిషి మానసిక ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయి దానివల్ల మనిషి జ్ఞాపక శక్తి దెబ్బతినవచ్చు. వాస్తవానికీ, కల్పనకీ మధ్య విభజన రేఖను (అదెంత సూక్ష్మమైనదైనా సరే) గుర్తించే శక్తిని మనిషి కోల్పోవచ్చు.

క్రిక్, మిచ్‌సన్‌ల దృష్టిలో రెమ్ నిద్రావస్థ ఇటువంటి అసంబద్ధ ఆలోచనా స్రవంతిని చెరిపేస్తుంది. కలగనటం ద్వారా పిచ్చి పిచ్చి ఆలోచనలు మన ఆలోచన భాండాగారంనుంచి తొలగించబడతాయి. ''కలగనటం మరిచి పోవటానికే'' అంటారు ఆశాస్త్రవేత్తలు. ఆ లెక్కన పనిగట్టుకొని కలగుర్తుకు తెచ్చుకోవడం హానికరం కావచ్చు. కానీ ఈ భావన మనోవిజ్ఞాన

శాస్త్రదృష్టికి పూర్తిగా వ్యతిరేకం. మనోవిజ్ఞానశాస్త్రంలో విశ్లేషకుడు కలలను కావాలని గుర్తుకు తెచ్చే ప్రయత్నం చెయ్యమని రోగికి సూచిస్తాడు ఈ రకంగా కలను గుర్తుకు తెప్పించడం ద్వారా అణిచివేయబడ్డ భావాలను చేతనావస్థలో గుర్తింపచేసి తద్వారా మానసిక వైకల్యాన్ని నయం చేసే ప్రయత్నం చేస్తాడు మనోవిజ్ఞానశాస్త్రజ్ఞుడు

క్రిక్ సిద్ధాంతం కలలోని వస్తువైచిత్రిని వివరిస్తుందేమోగానీ దాని (కలయొక్క) కథాకథనశైలిని వివరించింది మితిమీరిన కల్పనల నుంచి, వ్యాకులతనుంచి రక్షించుకొనేందుకు మనస్సు ఏర్పరచుకొన్న ఒకానొక రక్షక వ్యవస్థగా స్వప్నాన్ని క్రిక్, మిబ్సన్‌లు అభివర్ణించారు

జానాతన్ విన్సన్ అనే మరొక మానసికశాస్త్రవేత్త రెమ్ నిద్రావస్థ కల ప్రయోజనాన్ని నాడీ శాస్త్ర దృష్ట్యా వివరించే ప్రయత్నం చేశారు జ్ఞాపకశక్తిని గట్టిపరిచి తద్వారా జీవిని జీవన పోరాటానికి సన్నద్ధం చేయడం కలముఖ్య ప్రయోజనాలలో ఒకటని అతను వాదించాడు ఇతని వాదన వివరించేముందు తీటాతరంగాల గురించి నిద్రలో మెలకువలోను తీటా రిదమ్ గురించి కొద్దిగా తెలుసుకుందాం.

1954లో గ్రీన్, ఆర్డ్వేనా అనే శాస్త్రవేత్తలు జంతువులు చేతనావస్థలో ఉన్నప్పుడు వాటి మస్తిష్క భాగమైన హిప్పోక్యాంపస్ నుంచి సెకనుకు ఆరు క్రమబద్ధమైన తరంగాలు వెలువడినట్టు గమనించారు ఇది ఇఇజిలోని తీటారిదమ్‌ను పోలి ఉండటంతో వాటిని అదే పేరుతో పిలవడం మొదలు పెట్టారు. ఒక్కొక్క జంతువు ఒక్కొక్క ప్రవర్తనా సరళిని ప్రదర్శించినప్పుడు ఈ తీటారిదమ్ కనిపించింది. ఉదాహరణకు కుందేళ్ళలో అవి పరిసరాలలోని ప్రేరణలకు గురయినపుడు, ఎలుకలలో అవి ఆహార అన్వేషణ చేస్తున్నప్పుడు, ఇంకా మరికొన్ని జంతువులలో అవిలైంగికస్పందనలకు గురయినపుడు చేతనావస్థలో ఈ తీటారిదమ్ కనిపించింది ఆయాజంతువులు వాటి జీవనానికి అత్యంత ముఖ్యమైన పనులలో మునిగి ఉన్నప్పుడల్లా ఈ తీటారిదమ్‌ను శాస్త్రజ్ఞులు గమనించారు చేతనావస్థలో హిప్పోకాంపస్ లోని ఏకణాలు తీటారిదమ్‌ను ప్రదర్శించాయో, స్వప్నావస్థలో గూడా సరిగ్గా ఇదే కణాలు తీటారిదమ్‌కు గురయ్యాయి. బహుశా జీవి దీర్ఘకాలిక జ్ఞాపకశక్తిని, సరిగ్గా చెప్పాలంటే జీవి మనుగడకు అవసరమైన జ్ఞాపకశక్తిని వృద్ధిచేయడం రెమ్‌దశలోని తీటారిదమ్ ప్రయోజనంకావచ్చు.

పై విషయాన్ని పరిశీలించేందుకు శాస్త్రజ్ఞులు హిప్పోకాంపస్‌లో తీటారిదమ్‌ను ప్రదర్శించే కణాలను నాశనం చేసి చూశారు. అలా చేసినప్పుడు జంతువులు అంతకు మునుపు నేర్చుకొన్న విషయాలు మరిచిపోయాయి.

ఎకిడ్నా లాంటి గ్రుడ్లు పెట్టే స్తన్య జీవులలో మెదడులోని ప్రీ ఫ్రంటల్‌కార్టెక్స్ ఇతర భాగాలతో పోలిస్తే బాగా పెద్దదిగా ఉంటుంది. ఈ మస్తిష్క విభాగం రెండు ప్రధాన కర్తవ్యాలను నిర్వర్తిస్తుంది. మొదటిది వెనుకటి అనుభవాల ఆధారంగా ఎప్పటికప్పుడు చేరుతున్న సమాచారాన్ని బేరీజు వేయడం ఈరకంగా బేరీజు చెయ్యబడ్డ సమాచారాన్ని భవిష్యత్ అవసరాలకోసం భద్రపరచడం

రెండవది రెమ్‌నిద్రదశలో తీటారిదమ్ లేకపోతే ఎకిడ్నా సమగ్ర సమాచార విశ్లేషణ చెయ్యలేదు. జీవపరిణామ వృక్షంలో ఎంతో అడుగున ఉన్న ఎకిడ్నాలోని ప్రీ ఫ్రంటల్ కార్టెక్స్ అంతపెద్దదిగా ఉంటే పరిణామక్రమంలో ఎంతో ముందున్న స్తన్యజీవులలో ఈ భాగం మరింత పెద్దదిగా ఉండాలి ఎందుకంటే ఎకిడ్నాకంటే అగ్రభాగాన ఉన్న స్తన్యజీవులలో గ్రహణశక్తి, జ్ఞానసముపార్జన, అనుభవ పరిధి ఎంతో సంక్లిష్టంగా ఉంటుంది. ఇటువంటి సంక్లిష్టమైన సమాచారాన్ని కేవలం అతిపురాతనమైన 14 కోట్ల సంవత్సరాల వయస్సు కలిగిన తీటా రిదమ్ సహాయంతో సంశ్లేషించి భద్రపరచాలంటే ప్రీ ఫ్రంటల్ కార్టెక్స్, దాన్ని భద్రపరిచే మానవ కపాలం కనీసం కొన్ని పదులరెట్లు పెద్దదిగా ఉండాలి. ఈ సమస్యను ప్రకృతి ఎంతో తెలివిగానూ, అందంగానూ పరిష్కరించింది తక్కువ పరిమాణంలోనే ఎక్కువ సమాచారాన్ని నిక్షిప్త పరిచేవిధంగా మెదడులోని ఆ భాగం పరిణామం చెందితే, అతి సరళమైన పురాతనమైన తీటారిదమ్ బహు సంశ్లిష్టమైన ఎంతో సమర్థమైన రెమ్‌నిద్రదశగా రూపాంతరం చెందింది

పగలంతా వివిధ అనుభవాలకు గురయిన జీవి రాత్రి కలగనడం ప్రారంభించినపుడు వెనకటి అనుభవాలు బేరీజు వేయబడతాయి. జీవి మనుగడకు ఉపయోగించే జ్ఞాపకాలు కలగనటం ద్వారా బలపడతాయి కల జీవిని మరుసటిరోజు పోరాటానికి సమాయత్తం చేస్తుంది.

కలగనటాన్ని నిరోధించినప్పుడు (నిద్రను వాయిదా వేయడం ద్వారా రెమ్‌దశలో నిద్రను పదే పదే భగంపరచడం ద్వారా) మనిషి గ్రహణ శక్తి తగ్గినట్టు శాస్త్రజ్ఞులు గమనించారు. వాస్తవ ప్రపంచంపై వారికి పట్టుపోయింది. నెర్చుకొన్న విషయాలను వారు త్వరగా మరిచి పోయారు. ఒక కొత్త విషయం నేర్చుకొన్న తరువాత హాయిగా కునుకు తీస్తే నేర్చుకొన్న విషయం సంఘటితమవుతుంది. కొత్తగా సైకిల్‌నేర్చుకొన్న వ్యక్తి నిద్రలో అదేపనిగా సైకిల్ తొక్కుతున్నట్టు కలగంటాడు అదే విధంగా మొదటిసారి పేకముక్కలు పట్టుకొన్న వ్యక్తికి కలలనిండా ఆఠీను రాణీలు, డైమండ్ ఆసులు ప్రత్యక్షమవుతాయి.

కల కేవలం ఇటువంటి జ్ఞాన సంబంధమైన విషయాలను మాత్రమే కాక మనిషి భావోద్రేకాలను పరిష్కరించడంలో కూడా తోడ్పడుతుంది. కునుకు పడితె మనసుకాస్త కుదుట పడతది అన్నాడు కవి. కునుకు పట్టిన మనసులన్నిటికి తీపికలలు కనటం సాధ్యం కాకపోవచ్చు. కానీ అనేకానేక జీవన విషాదాలను ఉపశమింపచేయటంలో నిద్రకు, స్వప్నానికి అపారమైన పాత్ర ఉంది.

బహుశా ఫ్రాయిడ్ చెప్పినట్టు స్వప్నం సుప్త చేతనకు రాచబాట కావచ్చు. కానీ అధునాతన శాస్త్ర పరిశోదనలు, ఈ సుప్తచేతన అనేది కేవలం విశృంఖల భావోద్వేగాలకు వేదిక మాత్రమే కాదనీ, సుప్త చేతనకు గూడా ఒక ఆలోచన, దిశ ఉన్నాయనీ సూచిస్తున్నాయి. చేతనావస్థలోని మనిషికి తనకేంకావాలో తనకు స్పష్టంగా తెలియక పోవచ్చు. కానీ అగమ్యగోచరంగా పైకి కనిపించే అంతః చేతనకు, చేతనకి మించిన స్పష్టత ఉంది తనకు అంటే తన చేతనకు ఏం కావాలో చెప్పే ప్రయత్నాన్నిఅచేతనం ఎప్పుడు చేస్తూనే ఉంటుంది. యూంగ్ భావించినట్లు చేతనతో అచేతన జరిపే మార్మిక భాషణమే మన కల.

(సైకాలజి)

# వాసన తో గర్భనిరోధం?

– మిసిమి వర్క్‌షాప్

వాసన ద్వారా జంతువులు బ్రహ్మాండంగా భావ ప్రసారం చేస్తాయి. మరి మనిషి చేయగలడా? మన భావప్రసారం భాష ద్వారా చేస్తాము భాషలేని జంతు ప్రపంచంలో ఈ భావ ప్రసారం ఎలా జరుగుతుంది? ఎక్కువగా వాసన ద్వారా అంటే ముక్కు జంతువులకు చాల ముఖ్యమైంది. వాసనలలోని భేదాలను జంతువులు గుర్తించినట్లుగా మనిషి గుర్తించలేడు. పోలీసు కుక్కలు నేరస్తులను పట్టుకోవడంలో వాటి ఘ్రాణశక్తి ఏమిటో మనకు తెలుస్తుంది మనిషికీ ముక్కు ఉంది గదా? మరి మనిషి ముక్కు అంత సూక్ష్మభేదాలను ఎందుకు గుర్తించలేదు? దీనికి ఒక సమాధానం, మనిషి ఒక్కడే జీవులలోకెల్ల భూమికి నిటారుగ రెండు కాళ్ళమీద నడుస్తాడు, మిగతా జంతువులన్నీ అడ్డంగా నాలుగు కాళ్ళమీద నడుస్తాయి ఇలా నడవడంలో మనిషి ముక్కు భూమికి 5 అడుగుల చిల్లర దూరంలో ఉంటుంది జంతువు ముక్కు భూమికి సమీపంలో ఉంటుంది భూమి వాసనలకు పుట్టగనుక జంతువుల ముక్కులు భూమికి సమీపంలో ఉంటాయి గనుక, వాసనల ఘాటు వాటికి తగిలినంతగా, భూమికి దూరంగా ఉన్న మనిషి ముక్కుకు వాసనల ఘాటు తగలదు ఆవిధంగా మనిషి ముక్కు వాసన సున్నితత్వాన్ని కోల్పోయిందని చెబుతారు.

కాని ఇటీవలి ప్రయోగాలు మనిషి గూడ సున్నితమైన వాసనలకు అంధుడుకాడు, అతని ప్రవర్తనలో గూడ వాసన ప్రభావం స్పష్టంగా కానవస్తుంది అని తేల్చాయి. ఇక జంతువుల విషయం సరేసరి. వాసనను పసికట్టేశక్తే జంతువులకు లేకపోతే, దాని ప్రవర్తనా విస్తృతి తగ్గిపోతుంది దాని జీవితమే దుర్లభమవుతుంది.

భాషలేని జంతుప్రపంచంలో, ఒక జంతువు వాసనను బట్టి రెండోది 'ఎద'లో ఉందో లేదో తెలుసుకొంటుంది. లేదా దాడిచేసే యత్నంలో ఉందా, లేక పారిపోయే యత్నంలో ఉందా అని తెలుసుకుంటుంది. ఇది వాటికెలా సాధ్యమవుతుంది. ఈ వాసనలే వార్తలను, భావాలను, చిత్త వృత్తులను మోసుకెళ్ళే రసాయన ద్రవ్యాలను ఫెరోమోన్స్ (Pheromones) అంటారు. చాలా జంతువులు వీటిని ఉత్పాదిస్తాయి. జంతువులనుంచి ఎంతో ఎత్తుకు ఎదిగిన మానవునిలో వీటి పాత్ర ఏమీ లేదని భావిస్తారు. కాని దీనినంతా తలక్రిందులు చేస్తూ ఈ మధ్య ఒక ప్రయోగం జరిగింది. దీనిని నేచర్ (Nature) అనే పత్రికలో వేశారు. ప్రయోగం జరిపింది మనోవిజ్ఞాన శాస్త్రవేత్త మార్తా మక్క్లింటాక్. యూనివర్సిటీ ఆఫ్ చికాగోలో ఆమె ఆచార్యిణి ఆమె ఒక సరళమైన ప్రయోగంచేసి, మనుషులలో గూడా ఫెరోమోన్స్ ఉంటాయని తేల్చింది. ఈ ప్రయోగంలో, ఆమె, కొంతమంది ఆడవాళ్ళ చెమటను మరికొంత మంది ఆడవాళ్ళకు వాసన చూపించడం ద్వారా వారి ఋతుచక్రగతిని మార్చగలిగింది ఋతుచక్రవేగాన్ని తగ్గించగలిగింది, పెంచగలిగింది. ఇలాంటి అండం విడుదల కార్యక్రమాన్ని ఫెరోమోన్స్ అదుపుచేశాయని ఆవిడ నమ్మకం.

ఈ ప్రయోగం రైటైతే దీని పర్యవసానాలు చాలా దూరం పోతాయి మానవ ప్రభావ ప్రసారాన్ని

కొత్త కోణం నుంచి చూడడమేకాక, అనేకవైద్య పరమైన ఫలితాలను గూడ తెప్పించవచ్చు ఒకసారి మనిషిలో ఫెరోమోన్స్ ఉన్నాయని బుజువు చేయగలిగితే, అది ఎంత దూరం పోతుందో మనం చెప్పలేము.

ఫెరోమోన్స్ జంతువులలో ఉన్నాయని శాస్త్రజ్ఞులకు 1930ల నుంచే తెలుసు. కొన్ని రకాల మగ సీతాకోక చిలుకల లాంటి కీటకాలు కనరాని, వినరాని దూరంలో ఉన్నప్పుడు కూడ, వీటిని స్త్రీ కీటకాలు ఉత్తేజపరచగలిగాయని శాస్త్రవేత్తలు గమనించారు. మగ కీటకాలు తమ యాంటినాలతో గాలిలో తెలియాడుతూ వచ్చే ( ఆడ కీడకాలు వదిలిన) సువాసన (Pragrance) ను పసిగట్టి ఉత్తేజితాలై వేలాదిగా ఆ ప్రాంతానికి చేరుకొన్నాయి. రాణి ఈగ వదిలిన ఫెరోమోన్స్ ఇతర ఆడ ఈగలను పరిణత చెందకుండా నిరోధిస్తాయి ఎందుకంటే రాణి ఈగ జన్యువులే ప్రబలంగా ఉండాలి. చేపలలో ఆడ చేపలు వదిలిన వాసన గుర్తులు రాత్రికి రాత్రే మగచేపల ఇంద్రియాన్ని ఐదురెట్లు ఎక్కువ వృద్ధి చేస్తాయి ఏదైనా శత్రువు వాతపడినప్పుడు, ఒక ఉభయచరం వదిలిన రసాయనిక సమ్మేళనం, ఆజాతిచరాలు ఆ ప్రాంతానికి రాకుండా హెచ్చరిస్తుంది. క్షీరదాలలో ఈ ప్రక్రియ ఎక్కువగా ఉంటుంది ఇవి తమ మూత్రం వదలడం ద్వారా తమ ప్రాదేశిక సరిహద్దులను నిర్దేశిస్తాయి మగపందికొక్కులు వదిలే మూత్రంలో ఆడవాటిని రతికి పురికొల్పే రసాయనం ఉంది. ఈ రసాయనం ఆడవాటిని 48 గంటలలో అండం విడుదల చేసే దశకు తీసుకొస్తుంది. ''జంతువులకు జీవపరంగా సహాయపడే దానిని దేనినైనా చెప్పండి. అది తప్పకుండా వాసనద్వారానే సరఫరా అవుతుంది,'' అన్నాడు రాచెల్‌హెర్బ్ (Movell Chimical Senses Centre in Philadesphia)

అటు వంటి ప్రవృత్తులను మనుషులలో కనుక్కోవడం అంత తేలిక కాదు. మక్‌క్లింటాక్ 30 ఏళ్ళనుంచి ఈ ప్రయత్నంలో ఉంది ఆమె డార్మిటరీలో ఉన్న ఆడవాళ్ళలో ఒకేవిధమైన బుతుక్రమం ఉండడం గమనించింది. ఇతరజీవుల్లో ఇలాంటి 'ఏకత' ( సదృశ బుతుక్రమం) వాటి సంతతి అభివృద్ధికి తోడ్పడుతుంది వాటికి అలాంటిది ఉపయోగపడినప్పుడు మనుషుల్లో మాత్రం ఎందుకు ఉపయోగపడదు. ఇలా ఆలోచించి మక్‌క్లింటాక్, తన సహ పరిశోధకురాలు కథలీన్‌స్టెరన్‌తో కలిసి ఆడవారిలో అండం విడుదలనే కాక, వీలైతే దానిని మనం ఇచ్చవచ్చినప్పుడు విడుదలచేయించే అదుపును సాధించాలనుకొన్నారు. దానికి గాను వారు 29 మంది స్త్రీలను ఎంచుకొన్నారు. అందులో 9 మంది ఆడవాళ్ళకు చంకలలో పాడ్స్ (Pads)ను కొన్నిగంటలపాటు ఉంచారు అండం విడుదలకు కొంచెం ముందుగా లేదా కొంచెం తరవాతగా ఈ పాడ్స్‌ను ఉంచారు ఈ పాడ్‌లను తీసి, ఇతర ఆడవాళ్ళ ముక్కుల క్రింద రాశారు ఫలితాలు అద్భుతం. అండం విడుదల పూర్వపుపాడ్‌లు బుతుచక్రాన్ని 60% స్త్రీలలో 14 రోజులకు తగ్గించింది. అండం విడుదల దశాపాడ్‌లు మిగతా ఆడవారిలో (68%) బుతుచక్రాన్ని 12 రోజులు పెంచాయి. దీనిని బట్టి అర్థమయ్యేది ఏమంటే, ఒకే సమూహంగా ఉన్న ఆడవాళ్ళలో అండవిడుదల ప్రకృత్తి ''ఏకత'' (సదృశక్రమం వైపుకు) మొగ్గుతుంది.

ఇతర ప్రయోగాలు దీనిని బలపరిచాయి. అయితే ఒక ప్రశ్న మాత్రం మిగిలిపోతుంది. మనుషుల్లో ఫెరోమోన్స్ ఉన్నాయనుకొన్నా, శరీరం వాటిని ఎలా ప్రాసెస్ చేస్తుందో తెలియదు

క్షీరదాలు, సరీసృపాలు తమనాసికలలోని చిన్న గుంటలద్వారా (Voveronasal organ = VNO) ఫెరోమోన్స్‌ను కనుక్కొంటాయి మరి మనుషుల్లో VNO లేదు. ఫెరోమోన్స్‌ను గుర్తించడానికి మనుషులకు అవి అవసరమా? అనే సంగతి అనుమానమే కొంతమంది శాస్త్రజ్ఞులు మనుషుల నాసికలలో ఏవో గుంటలు కనుగొన్నారు కాని అవి ఈ పనిచేస్తాయో లేదో తెలియదు

మక్‌క్లిన్‌టాక్ మాత్రం తన పరిశోధనలు ఆపక ముందుకు పోతూనే ఉంది. ఫెరోమోన్స్‌ల ఉపచారం పిల్లలు లేని దంపతులకు త్వరగా పిల్లలు కలిగేందుకు, వద్దనుకొనే వారికి గర్భనిరోధక మందులు లాగ పనికివస్తుందని ఆమె అంటున్నది మరి కొంతమంది ఫెరోమోన్స్ ద్వారా అవసాదం (కుంగిపోవడం) ఒత్తిడి లాంటి మానసిక స్థితులను సరి చేయవచ్చునంటున్నారు. వీటిద్వారా ప్రొస్టేట్‌గ్రంధి పనిని అదుపుచేసి క్యాన్సర్ బారి నుండి కాపాడవచ్చునంటున్నారు ఏది ఏమైనా శరీరం ఎలా పనిచేస్తుంది అనేది ముక్కు క్రింద కాక ముక్కు లోపల ఉంది

# READERS' QUESTIONS

1. Which disease is also known as the "Christmas Disease"? (Nirmalendu Chakraborty, Ashram Road, Cooch Behar.)
2. The custom of hiring small boys by the royal household to take any punishment from the tutor in place of the erring princes has given rise to a term in the English language What is it? (Prosenjit Paul, Jadavpur, Calcutta )
3. Which poet was known as the "Poet of the Piano"? (Mainac Mandal, Barrackpore, Calcutta )
4. George Bernard Shaw was once asked which book gave him the most profit Take a wild guess what his answer was. (Think jokingly )
5. Who was called the "Grand Old Lady of Indian Culture"? (Soma Bhowmik, Bidhan Nagar, Calcutta.)
6. What is common to Emil Jannings, Janet Gaynor, Frank Borzage, Lewis Milestone and the film Wings? (Sanjoy Bhadra, Rahara, 24-Parganas )
7. Which T V serial has the slogan "The truth is out there"? (Partha Pratim Nath, Tarun Nagar, Guwahati.)
8. What is common to Air Bakin, Air Melt, Air Grill and Air B-Que? (Tandra Chakraborty, Raja Rammohanpur, Darjeeling.)
9. What would you fear if you suffered from Omrophobia? (Vikash Bhansali, Ashrampara, Siliguri )
10. Who were the world's first paper makers? (Kenneth Vaz, Dum Dum, Calcutta.)

**ANSWERS :**

*1. Haemophilia; 2. Whipping boy; 3. Frederic Chopin, 4 His cheque book; 5. Pupul Jayakar; 6. All won Oscars in the inaugural year; 7 The X Files, 8. They are all new brands of Nike shoes; 9. Rain; 10 Hornets - insects of the wasp family. Their nests are made from paper produced from wood pulp*

# ప్రస్తుత కథా రచనలో మాండలిక భాష అవసరమా ...!

- అద్దంకి శ్రీనివాస్

ఇప్పుడొస్తున్న కథల్ని స్థూలంగా పరిశీలిస్తే రెండు రూపాలలో మనకి కనిపిస్తాయి

1 జీవితాన్ని అనుసరించి రాసే కథలు; 2. జీవితాన్ని అనుభవించి రాసే కథలు

జీవితాన్ని అనుసరించి రాసే కథలకి ఆర్ద్రత పాళ్ళు తక్కువగా ఉంటాయి. కానీ రచనాశైలి ఆ తక్కువ తనాన్ని కిక్కురు మనకుండా చేస్తుంది. ఏదైనా ఒక సమస్యపై లేదా ఒక సంఘటనపై స్పందించిన రచయిత ఆ కథావస్తువులో దూరి, లోటు పాట్లని అవగతం చేసుకున్నా ఆ కథావస్తువు యొక్క సహజ స్వరూపానికి, కవి రచనాత్మక హృదయానికి తేడా తప్పకుండా ఉంటుంది అలా కాకుండా ఆకస్మిక సన్నివేశాలతోనో అకస్మాత్తు సంఘటనలతోనో ఉలిక్కిపడిన రచయిత నిజంగా కథాత్మకమైన వస్తుభావజాలాన్ని అనుభవించి రాస్తాడు. కథావస్తువులో పూర్తిగా తాదాత్మ్యం చెందడం దీనిలో కన్పిస్తుంది.

ఈ రకమైన కథా స్వరూపానికి మాండలిక భాషా ప్రయోజనం ఏ రకంగా ఉందో చూద్దాం.

ఇప్పుడు రచయిత ఏదైనా ఒక దళితుల సమస్యపైనో, లేదా ఒక గ్రామీణ సంఘటనపైనో వ్రాస్తూ, ఆ కథకు సంబంధించిన కథనమంతా నాగరిక శైలిలో నడిపిస్తే ఆ కథ షుగర్ కోటింగ్ కొట్టిన చేదు మాత్రలానే ఉంటుంది. '' ఔచిత్యం రస భంగస్య కారణం'' అని మమ్మటుడు చెప్పినట్లు ఔచిత్యం పోయి కథ పేలవంగా ఉంటుంది.

కానీ అదే సందర్భానికి, పాత్రలకీ సరిపడే భాషనీ, ఆ ప్రజలకి అర్థమయ్యే భాషనీ రాయాలంటే ఉపయోగపడేదే మాండలికభాష.

మాండలిక భాష ప్రయోగించడం భావ్యం కాదనీ, ఎక్కడో మాండలిక ప్రదేశాలలో ప్రయుక్తమయ్యే భాషను కథాశైలిలో వాడటం అంత బావుండదనీ అనేక అపోహలున్నాయి. కానీ వస్తువుకి సంబంధించి, పాత్రలకి సంబంధించి, ఆయా సన్నివేశ వాతావరణాన్ని పాఠకులని కళ్ళకి కన్పించేట్టుగా చేసేదే ఈ మాండలిక భాష.

భాషా శాస్త్రం ప్రకారం, మానవుడెంత ప్రాచీనుడో భాషకూడా అంత ప్రాచీనమైనదే.

"Language is a system of arbitary vocal symbols by means of which a social group cooperation"

- OUT LINES OF LING. ANALSIS

పరస్పర అవగాహనాక్షమ్యత ద్వారా ఉద్భవించిన ఈ భాష క్రమంగా నాగరికతావిర్భావం జరిగిన తర్వాత హృదయోల్లాసం కోసం చేయబడిన రచనలలో లలితకళలలో ఒకటైన కవిత్వం ద్వారా చోటు చేసుకుంది. కాలానుగుణ పరిణామాల వల్ల రచనలలో సైతం సమస్యల పరంపర చోటుచేసుకుంది. కడుపు నిండిన నాటి రచనలకీ, కడుపు కాలే నాటి రచనలకీ వ్యత్యాసం చాలా వచ్చింది. నాగరికత పెరిగినా అనాగరిక చర్యల్ని పెంచుకుంటున్న మానవుల మనోవిశ్లేషణతో రచనలు బయలుదేరాయి. ఆ మనుషుల వాతావరణానికి, ఆయా మనసుల విశ్లేషణకీ అవసరమైన వ్యావహారిక భాషలోనే రచనలు చేయాల్సిన అవసరం ఏర్పడింది.

తద్వారా మాండలిక భాష కథా సాహిత్యంలో చోటు చేసుకున్నది.

ఒక సమస్యని ప్రయోజనాత్మకంగా కథలో తీర్చిదిద్ది సమాజసందేశాన్ని అందించే కథల్ని మాండలిక భాషలో రాయడం వల్ల అన్ని ప్రాంతాలవారికీ అర్థం కాదనీ, కథయొక్క మూల స్వభావమైన సరళత్వానికి భంగం కలుగుతోందనీ, వేరే ప్రాంతాల వారికి ఆ కథ అర్థమవ్వక జుట్టు పీక్కోవలసి వస్తుందనీ, పాఠకుల సంఖ్య పడిపోతుందనీ అనుకొనే రచయితలు, పాఠకులూ కూడా మాండలిక భాషా ప్రయోజనాల్ని కూలంకుషంగా అవగాహన చేసుకుంటే తమ అభిప్రాయాల్ని మార్చుకోక తప్పదు

వాస్తవంగా ఆలోచిస్తే కథా సాహిత్యంలోకి మాండలిక భాషా ఒరవడి రావడమనేది ఒక అద్భుతమైన మార్పు. ఒక గ్రామీణ ప్రాంత కథావస్తువు తీసుకొని వారి జీవితం, జీవన విధానం ప్రతిఫలించేట్టుగా వారి భాషలోనే, వారి మాటల్తోనే, వారు పల్లెల్లో నిత్యం చూస్తున్న విషయాలనే వ్రాయడమన్నది నిజంగా ఒక విధమైన సామాజిక చైతన్యంగా మనం భావించవచ్చు. ఇలా రాసిన కథల్ని చదివితే పాఠకులకి వచ్చేది అవగాహన కాదు ఆలోచన ఇంతటి మహత్తర ప్రయోజనం కథలకి తెచ్చిపెట్టింది ఈ మాండలిక భాషే.

ఈ భాష ఎక్కువగా వ్యవహారంలో ఉన్నది సామాజికస్థాయి తక్కువగా ఉన్న చోటే. సాధారణంగా మాండలికంలో సామాజిక స్థాయి తగ్గినకొద్దీ సమ్మేళనాల వ్యాప్తి తగ్గుతుంది మాండలికత పెరుగుతుంది. సామాజిక స్థాయి పెరిగిన కొద్దీ సమ్మేళనాల వ్యాప్తి పెరుగుతుంది. అంటే మాండలికత తగ్గుతుంది.

అంటే వ్యక్తి స్థాయి పెంచుకొని విద్యావంతుడై, తను నాగరికుడనిపించుకోవడానికి, మాండలికభాషని పూర్తిగా విడిచిపెడుతున్నాడు. అలాంటప్పుడు సమాజంలో మాండలిక భాష బాగా తగ్గిపోయి అసలు మాండలిక భాష స్వరూపమే తగ్గిపోతున్న తరుణంలో ఎక్కడో మారుమూల ప్రాంతాలకే పరిమితమై పోతున్న భాషని అన్ని ప్రాంతాలకీ తెలియజెప్పడం రచనలలో మాండలికత్వం వల్లనే సాధ్యపడుతుంది.

భాషా ప్రామాణికతను నిరూపించడానికి ముఖ్యమైనది ఏకీకరణ కార్యం. దీనితో ప్రామాణిక భాషా రూపకల్పన జరుగుతుంది. మాండలిక భాషలో కథలు రాయడం వల్ల ఆయా మాండలిక భాషా పదాలు, ఆ ప్రాంతాలకే పరిమితం కాక, అన్ని పదాలూ అన్ని ప్రాంతాలకీ వ్యాప్తి చెంది, తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలోని పదాలు శ్రీకాకుళం ప్రాంతాలకీ, శ్రీకాకుళం మొ॥ ప్రాంతాలలోని పదాలు, తెలంగాణా ప్రాంతాలకీ పరిచయం జరిగి, మొత్తం కలిసి ఒకే భాషా విశేషంగా విస్తృతం అవుతుంది. భాషావ్యాప్తి, ఆ వ్యవహర్తలు ఎక్కువ అవడం జరుగుతుంది. ఒకే స్థిరమైన ప్రామాణిక భాష ఏర్పడుతుంది.

ఈ భాష విశృంఖలంగా ప్రయోగింపబడి వృద్ధి పొందటం, అనేక నూత్న పదాలు అందరికీ తెలియడం జరుగుతుంది.

స్వచ్ఛమైన తెలుగు కేవలం పల్లెల్లో, ఎక్కడో మారుమూల ప్రాంతాలలోనే కాక, సహజత్వం ఆ భాషా పరిసర ప్రాంతమంతా ఎగబ్రాకుతుంది. పరిసరభాషా ప్రభావంతో మన భాషలోనికి

ప్రవేశించిన సమీకృత అసమీకృత భాషా ప్రయోగ పదాలు (LOAN WORDS), ఎన్నో మార్పులు చెందిన తర్వాత కూడా అందరికీ తెలుస్తాయి

ద్రావిడ భాషా ప్రభావం మాండలిక భాషలో పదాలపై అధికంగా ఉంటుంది ఈ పదాల్ని రచనలలోనికి తీసుకురావడం వల్ల ఏయే భాషా ప్రభావం వల్ల ఏ భాష ఎలా వచ్చిందో అప్రామాణికులతో ఎలా ఉచ్ఛరింపబడుతుందో, ఆదాన ప్రదానాలకి (Borrowing) గల కారణాలేమిటో తెలుసుకోవచ్చు మరిన్ని కొత్త భాషల ఆవిర్భావానికి హేతువౌతుంది ఈ మాండలకాలన్నీ కలిసి ఒక ప్రామాణిక భాషగా ఏర్పడినా, మళ్ళీ సామాజిక స్థాయిని బట్టో, వృత్తులను బట్టో, ప్రాంతీయ భేదాల్ని బట్టో మళ్ళీ విభిన్న మాండలిక భాషలు ఉద్భవిస్తాయి ఉదాహరణకి పూర్వం తెలుగు, తమిళం, కన్నడం మొదలైన ఈ భాషలన్నీ, మూలద్రావిడభాషకి చెందిన మాండలిక భేదాలే

ఆయా ప్రజల జీవన విధానం, వారి ఆలోచనలు, ఆచారాలు అన్నింటినీ మించి, పల్లెల గురించి అచటి వాతావరణం గురించి, సమాజస్థితి గతుల గురించి ప్రత్యేకంగా ఈ మాండలికాల వల్ల తెలుసుకోవచ్చు

కాబట్టి కథారచనలో మాండలిక భాష ఒక రచనా పరిణామం ఒక ప్రయోగాత్మక విప్లవం దీనిని ఎవ్వరూ కాదనలేరు. కాదని రచనలు చెయ్యలేరు కూడా.

## BEAUTY & BRAINS

1. Who was the first person to win the Miss India contest?
2. What style of announcing winners originated at Eric Morley's Miss world contest?
3. What highly visible public service campaign does former Miss World, Aishwarya Rai, appear in?
4. Miss India, Nafisa Joseph, hosts a T V programme on which channel?
5. Since it started in the 1980s, which city has hosted the most Miss World contests?
6. Which former Miss India went on to star in a Dev Anand blockbuster?
7. Name the first Indian to win a Miss World title.
8. Which country has won the most Miss Universe titles?
9. Former Miss World, Aishwarya Rai, made her debut in Hindi films with which movie?
10. Last year, exactly where in Bangalore was the swim-suit round of the Miss World held?

**ANSWERS**

*1. Meher Castillino; 2. Calling out the results in reverse order; 3. "Donate Your Eyes"; 4. MTV; 5. London; 6. Zeenat Aman; 7. Rita Faria; 8. Venezuela; 9. Aur Pyar Ho Gaya; 10. That was a googly question. The swimsuit round was held in Seychelles.*

